# ప్రకటన

నాచే రచియింపబడిన ఈ సత్యహరిశ్చంద్ర-యక్షగానముయొక్క సర్వాధికారములు కొండా శంకరయ్యా పుస్తకముల దుకాణమువారికి యిచ్చియున్నాడను.

ఇట్లు
చెర్విరాల భాగయ్యకవి
ముషీరాబాదు.



# హెచ్చరిక

ఈ సత్యహరిశ్చంద్ర-యక్షగానము యొక్క సర్వాధికారములు మాకే జెందియున్నవి కావున యితరులు దీనిని ము[illegible]కూడదు. అట్లు ముద్రించినచో మేము చేయబోవు సివిల్ క్రి[illegible] చర్యలకు బాధ్యులగుదురు.

ఇ[illegible]
ప్రకాశ[illegible]
కొండా శంకరయ్యా
పుస్తకముల వ్యాపారము

శ్రీ పరమేశ్వరాయనమః



# సత్యహరిశ్చంద్ర - యక్షగానము

క॥ శ్రీగౌరీ హృదయేశ్వర । నాగకులాభరణ ప్రమథ నాయక శివ యో
సాగిలి మ్రొక్కెద నీకిక । బాగుగ శ్రీ మశురబాద పౌరి నివాసా ॥
క॥ పని చెరుపులద్వారనిను నా । మనమున వినుతింతునయ్య మహావేడుకతో
పనిబూని నాదుకోర్కెల । కొనసాగగ జేయుమయ్య కోరికలలరన్ ॥
క॥ వీణాలంకృత పల్లవ । పాణీ యలినీలవేణి పద్మజురాణీ
వాణీ మ్రొక్కెద నిదె గీ । ర్వాణీ నాజిహ్వయందు వసియించగదే ॥
క॥ తలచెద జననీజనకుల । దలచెద నా గురులపాద తామరసములన్
దలచెద పూర్వకవీంద్రుల । దలచెద కలికాల కవుల దప్పకమదిలోన్ ॥
క॥ లక్షణ శాస్త్రంబుల నే । వీక్షింపగ లేదు శాస్త్రవిధుడనుగాకన్
దీక్షవహించితి యా నిట । లాక్షుడె సర్వంబునకును రక్షకుడనుచున్ ॥

వ॥ ఇటుల నాయొనర్పంబూనిన సత్యహరిశ్చంద్ర యక్షగానము నకు కథాక్రమం బెట్టిదనిన.

—( రంభ ఊర్వశి రాకడ )—

క॥ శ్రీలలన విభుని ప్రియసఖ । ఫాలాక్ష సురేంద్రవినుత పార్వతిరమణా
నీలగ్రీవ దయాకర । చాలగ నామదిలో నిన్ను సన్నుతి జేతున్ ॥

దరువు - ఆట

రంభోర్వసూలమమ్మా । వచ్చితిమిందు । రమణీ ముద్దులగుమ్మా
జంభారి సభలోన సరసులందరు మెచ్చ । అంభోరుహాక్షి మేమాటలాడెద
మమ్మా ॥రం॥ సరసిజాక్షులమేమమ్మా । భరతశాస్త్ర । సరణి దెలసితి

మోయమ్మా । కరమొప్పగా మానివరుల మానసమూను । కరిగించి నిరతంబు మరు కేళి గూడెటి ॥రం॥ ధరణిలోవల వెలసినా । మశురబాద పురమందు నివసించినా । గరళకంఠుని పాదసరసిజముల మది । స్మరణ యేమారక జనుదెంచితిమి యిందు ॥రం॥

చె-క॥ ఎందుండి మీరలిచటికి । పొందుగ నరుదెంచినారో పూబోణు
లుమీ । రందంబుగ తెర వెడలియు । యిందలి సభవారికెల్ల ।
వినిపింపుడికక ॥

తెరవెడలుట దరువు - త్రిపుట.

భామా తెర వెడలేదామోయమ్మా । మావా ర్తనీకు । ప్రేమా తోడూత దెల్పెదమమ్మా । కాముని శుకముల ప్రేమవాక్కులతో । యీ మహీజనులకు నింపునుగూర్పగ ॥భా॥ తాళమృదంగధ్వనులతోడా । తాధిమి తకధిమియని । మేళవించియు ముదముతోడా । కాళ్ళనందియలు ఘల్ ఘల్ మనగను । వల్లవాధరిరో బహుసుందరముగ ॥భా॥ నిండూ వైభవము గులుకగాను । వసుసా ముప్పదియు రెండు రాగంబుల పాటలతోనూ । దండి మశురబాద ధాముడై వెలసిన । కుండలి భూషణుని కోరి నుతించుచు ॥భా॥

రంభ - ద్విపద.

చెలియరో మాయొక్క చరితంబు నీకు । వలనొప్ప దెల్పెద వాంఛతో వినుము । అంబుధి జనితుల మమ్మరో మేము । రంభ నా నామంబు రమణీలలామ । నాసఖి యూర్వశి నందురూ యీమె । వాసిగా మేమెల్ల వాసవు సభను । నృత్యగానములచే నెల్ల వేళలను । అత్యంత విభవమున నలరారుచుండి । సురలతో క్రీడించి సుధయును గ్రోలి । చరియించుచుందుము సర్వవేళలను । ధరణి మశురబాద ధాముడై నట్టి పరమేశ్వరుని చాల ప్రస్తుతించెదము ॥

దరువు - ఆది

వారస్త్రీలము మేమోయమ్మా । చక్కదనమున నె । వ్వారు మా సాటిరారోయమ్మా । సారసాక్షి వాసవు సభలోపల । సారెకు నాట్యము సలిపెడివారము ॥వా॥ శృంగార వతులము మేమోయమ్మా । మా దేహ కళలు బంగారమూను మించూనమ్మా । సంగడి కోలలు సఖ మా కరములు । బొంగరములతో బోల్చ చనుగవలు ॥వా॥ హరిమధ్య

మధ్యము మాదోయమ్మా । కదళీ స్తంభముల । పరిహసించును మాపెం దొడలమ్మా । సరసిజములతో సరియగు కన్నులు । తరుణీ నవపల్లవ చరణంబులు ॥వా॥ ధరణీ మహారబాదలోనా । నెలకొన్న శాంకరి । వరునీ దలచేద నా మదిలోనా । సరగున నిప్పుడె సురపురిజేరగ । యరు దేరిన మృదు యంచయానలము ॥వా॥

వ॥ అని ఇటుల వచించి రంభోర్వసులు వెడలిపోయినంతలో.



—( మాతలియను ప్రధానిరాకడ )—

దేవేందర్‌కీ సవారినికలే । బక్వాక్యం మచుహాతాహై । హాతీ ఘోడా ఊంట్ పాలకీ । రథపైదల్ సబ్ సాధీహై ॥దే॥ ఢంకా తక్తు నిషాణ్ సే అబ్ దర్బారమె తశ్రీఫ్ లాతాహై । తెత్రీస్ కరోడ్ దేవతా అవుర్ । రుషిముని యోసబ్ ఆతేహై ॥దే॥

మంత్రికి హాస్యకానికి వాదం మాటలు.

మం॥ చూప్ కామోష్, యేతమాం రోషినీ ఉజియాలా క్యాహై

హా॥ మహారాజ్ యహాభాగవత్ ఖేల్ రహేహై

మం॥ క్యా భాగవత్ ఖేల్ రహేహై

హా॥ రాజా హరిశ్చంద్రజీకే నాటక్ ఖేల్ రహేహై

మం॥ బహుత్ అచ్ఛాఖబర్ సునాయా, లేకిన్ యిస్ భాగవత్ కో కోణ్ బనాయా.

హా॥ మహారాజేశ్రీ కొండాశంకరయ్యా సాహుకార్ సే బన్వాయా

మం॥ కిస్వాస్తే బన్వాయా.

హా॥ దునియాభర్ నాం మషుహూర్ హోనేకేలియే, ఔర్ సచ్చాయి ఫైలానేకేలియే.

మం॥ బహుత్ అచ్ఛా లేకిన్ యిస్ భాగవత్ కో కోణ బనాయా

హా॥ చెర్వీరాల్ భాగయ్యా కవీనే బనాయా.

మం॥ అచ్ఛా అబ్ మహారాజా యిందర్ దేవకీ సవారీ ఆనే వాలీహై మై పేశ్వా జాతాహుం గడ్‌బడ్ నైకర్నా కామూష్.

హా॥ అజీమహారాజ్ ఆప్కానామ్‌తో జరా సునాయ్యియే.

మం॥ అచ్ఛా సునో,

మంత్రి - దర్వు

మాతలీయనే ప్రధానుడా। మహా। నీతి ప్రబంధ విశాలుడా। పాతకులైనట్టి బలురక్కసులబట్టి। ఘాత నొందించిన। ఘన బాహు బలుడాను ॥మా॥ మారసుందర దివ్యకాయుడా। యన। మానసత్కీర్తి సంపన్నుడా। పారవార. గంభీరుడ వీరుడ। మేరుధీరుడాను మేటికోవిదుడాను ॥మా॥ ధరణీ మశుర బాద వాసునీ। నేదలచేవ మదినీ విశ్వేశునీ। సురనాథు మంత్రినై సురలెల్ల బాగుడాగ। యురుదెంచితిని యిందు యానంద మొప్పగ ॥మా॥



—( దేవేంద్రుడు రాకడ )—

క॥ కర్పూర ధవళగాత్రా । దర్పక సంహార సకల తామస దళితా
సర్వవిభూషణ నినునే । నేర్పడగా మదిలో దలతు నింపుదలిర్పన్ ॥

దర్వు – ఆట

సురనాథుడరుదెంచెనూ । దశదిక్కులు । సురుచిరమును హెచ్చనూ । గరుడ గంధర్వ కిన్నెర కింపురుషులగూడి । కరమొప్పగా శ్వేత గజముపై నెక్కియు ॥సుర॥ భేరిదుందుభులెల్లనూ । భోరునమ్రోయ । ధీరోదాత్తుడు వేగనూ । సారెకు దేవత నారీమణులెల్ల । నీరాజనములివ్వ భూరివైభవమూతో ॥సు॥ అష్టప్రధానులునూ । దిక్పాలకు లరుదేరగను వెంటనూ ॥ సృష్టి సంతతి తన్ను నిష్టతో బాగుడాగ । దుష్టదానవులాను దునుమాడి వేడ్కతో ॥సు॥ ధరలోన నుతికెక్కినా । మశురబాద పురవాసుడన మించినా ॥ కరిచర్మచేలూని చరణయుగ్మంబూను । మరిమరి తనయొక్క మదిలోన దలచూచు ॥సు॥

ద్వి–క॥ స్వామీమీరెవ్వరో కా । మీమహిమలు మీదు కళలు మీవైభవమున్ । సామాన్యమనగరాదిక । ప్రేమతో తెర వెడలుడయ్యా సేవలోనర్తున్ ॥

తెర వెడలుట – దర్వు – ఆది

ఇంద్రుడానూ । వినర దేవేంద్రుడానూ । సాంద్ర విభవుడను సద్గుణ నిధుడను । చంద్రముఖుడ నిస్తంద్ర శూరుడను॥యిం॥ ధీరుడానూ రణజయ శూరుడానూ । పారవార గంభీర హృదయుడను । కోరికతో సభ జేరవస్తినిటు ॥యిం॥ శీలుడానూ । శచీలోలుడానూ । మేలుమశురబాద ప్రోలులో వెలసిన । నీలగళుని మది చాలగ దలచెద ॥యిం॥

ఇం–సీ॥ వినర ద్వారకనాదు వృత్తాంత మెల్లను । వినుపించెదను నీకు వేడుకలర । స్వర్గలోకమును నిరర్గళంబుతో నేను। పాలించుచుందును బలుముదమున । నాయొక్క భార్యయు నారీశిరోమణిన్ । శచీదేవి యందురు సకల సురలు । సుతుడు జయంతుడు నతిసుందరాంగుడు । మతిమంతుడౌ బృహస్పతియు గురుడు । మేరుధీరుడ రణరంగ శూరుడాను । పాకశాసనుడంద్రుడనగ బలుముదమున । యీడు లేకను ముప్పది మూడుకోట్ల । సురలపాలింతు నెవ్వేళ కరువుదీర ॥

## దర్వు - అది

పురందరుఁడ రణ ధురంధరుఁడ శ్రీకరుండ శ్రేయస్కరుండరా । దురాంధకారుల ధరణిఁగూల్చి భూ । భారంబు మాన్పిన శూరుండరా । పు॥ దేవాధిపుండను ధీలోలుఁడను నే । భావజ శతకోటి తేజుఁడా । సావధానమని శివిన్ జలంగగ । దేవలోకమేలు వాఁడరా । ॥పు॥ హిత మతి శచీసతీ పతిని శ్రీ । పతికీ ప్రియసోదరుండరా । యతిపతీ బృహస్పతికి శిష్యుఁడ । దితిదేవి సూనుండరా ॥పు॥ ధరణి మథురబాద పురిణి వెలయు శంకరున్ నామదిని దల్తురా । వరంబు లిమ్మని నిరంతరము సుస్థిరంబుతో ప్రార్థింతురా ॥పు॥

## దేవేంద్రుఁడు సభ జేయుట దర్వు - ఆట

సభజేయుదమా । మాతలినేడు ॥స॥ శుభకరంబని వేగ సకల నభచరులు బహు సంతసింపగ । రభసమున రంభోర్వసులు బలు రమ్యముగ నాట్యంబు సల్పగ ॥స॥ పండితులునూ । గాయకులును॥పం॥ నిండుముదముతో వారు మనల క । ఖండముగ దీవనలొసగంగ । దండిగను రిపు తండములబల్ గుండెలదరగ మండితంబుగ । భేరిధ్వనులూ । భోరున మ్రోయగానూ ॥భే॥ సారెసారెకు మథురబాద పౌరమందిర మందు వెలసిన । మారసంహారు చరణముల మన మానసంబున స్మరణ జేయుచు ॥స॥

వ॥ ఈ ప్రకారంబుగా యింద్రుండు సభచేసి కూర్చున్నంతలో.

## ఋషులు రాకడ దర్వు - ఆట

దేశమానులమూ । వచ్చితి మిందు । ధీవిశాలురమూ । భావ శుద్ధిగల భక్తులకెల్లను । దీవన లొసగిన దివ్యజ్ఞానులము॥దే॥ వేదవేద్యులమూ సచ్చిదానంద । మోదమానసులం । నాదుబిందుకళ నంటిచరించుచు । సాధువృత్తితో జగతిలో వెలసిన ॥దే॥ తత్త్వవేత్తలమూ । అరివర్గరహితులము సత్వగుణ హితులం । నిత్యానిత్య వివేకపరులమై । సత్యవ్రతుల నగత్యము బ్రోచెటి ॥దే॥ యోగాభ్యాసులమూ । పంచవిషయాది । భోగరహితులమూ । బాగుగ మథురా బాదలొ వెలసిన । నాగభూషణుని నభినుతి జేతుము ॥దే॥

ద్వా-వ॥ అయ్యా పరమ మునీంద్రులు మీమీ నామధేయంబు శ్రీ సభవారికి వినంజేసి కర్ణానందము గావింపుడు

వశిష్ఠుని వాక్యము

కం॥ అష్టాంగ యోగములనే । నిష్ఠతొ సాధించినాడ నిర్విఘ్న తను వ । శిష్ఠుడ నామము వినరా । స్రష్టకు పుత్రుండనేను । సన్ముని హితుడ౯॥

విశ్వామిత్రుని వాక్యము

కం॥ జనపతి గాధికుమారుడ । ఘనమైన తపోధనుండ కరుణ హృదయుడన్ । మునిజన శ్రేష్ఠుడ శిష్ఠుడ । విను విశ్వామిత్రుడండ్రు । వేడ్క చెనన్ను౯ ॥

బృహస్పతి వాక్యము

కం॥ సురులకు సురనాధునకును । గురువర్యుడ సకలశాస్త్ర । కోవిదుడనునే । పరమార్థ వినోదుడన౯ । కరమొప్ప బృహస్పతండ్రు గదరావారీ ॥

నారదుని వాక్యం

క॥ సారస గర్భుని పుత్రుడ । ధీరతో ముల్లోకములను । దిరిగెటి వాడ౯ । కోరికతో జనుదెంచితి । నారాయణు దలతునెపుడు । నారదుడనురా ॥

వ॥ ఇటులరుదెంచిన రుషిపుంగవులను దేవేంద్రు డర్ఘ్య పాద్యాది విధులతో పూజించి ఉచితాసనంబుల గూర్చుండ నియమించి యేమను చున్నాడనన.

యింద్రునికి వశిష్ఠునికి వాదం - దర్వు - ఆట.

యిం॥ దేవమౌనులారా । మీరలు । దెల్పుడి నాతోనూ । భావ మలర నొక ప్రశ్న జేసెదను । భావ్యము తోడుతనూ ॥

వశి॥ అనిమిషేంద్రనీదూ । మనసున । జనియించిన విధమూ । విన జేయుమునీ ప్రశ్నకుత్తరం । బును నొసంగెదామూ ॥

యిం॥ మూడులోకములనూ । మీరలు । వీడక తిరిగెదరూ । ఆడి తప్పని యవనీశ్వరు డెవ్వాడొ దెల్పుడికనూ ॥

వశి॥ ధరణిలోన వెలయూ । నయోధ్యా పురమును పాలించూ వరగుణాఢ్యుడా హరిశ్చంద్రుడు । వాక్కు శీలుడతడూ ॥

యిం॥ అంతపాటివాడా । నరవరు । డంతసత్యవ్రతుడా ।యింతటి వానిని యెన్న డెరుంగను । యెవరు జెప్ప వినసూ ॥

వశి॥ శంక లేక వినూ । అతడుత్రి । శంకుని పుత్రుడునూ । పంకజ మిత్రుని వంశసంభవుడు । బలపరాక్రముండూ ॥

యిం॥ సరెమెచ్చితి నేనూ । యాతని ।. సచ్చరిత్రమూను । ధర వెలసినశ్రీ మకురబాదపురి । ధాముని సాక్షిగనూ ॥

వ॥ అనిన విశ్వామిత్రుండు కోపంబునలేచి వశిష్ఠునితో.

విశ్వా-కం॥ దేవసభా మధ్యంబున । నీవిధమున కల్లలాడ నీకుం దగునే । భూవల్లభుడేడను స। త్యావాక్యము లాడుశేడ । ధర్మ విహీనా ॥

వశి-గీ॥ నిజము బల్కినంత నీయొక్కమదికింత । నిష్ఠురంబుదోచ నేమిఫలము ।. కయ్యమునకు నిట్లు కాలుదూర్చుటదేల । సహజ గుణము నీకు చాలుచాలు ॥

వాదం - దరువు - ఆది.

విశ్వా॥ వరేవశిష్ఠా సురేంద్రు సభలో । నరాధముని పెంపు జేసి యున్ । మొరంగెదవు నోడలెరుంగకనునే। నెరుంగనాయాభూపాలునిఁ॥

వశి॥ కరుణావిరహిత కౌశిక నీదగు । విరసము చాలింపవేటికిన్ । సరస గుణాత్ముడు సత్యశీలుడా । హరిశ్చంద్రు దూరనేటికిఁ ॥

విశ్వా॥ లంచగొండి నీశిష్యుడౌటయా । కొంచగాని గొప్పజేసి యుఁ । మంచివాడటని యెంచిబల్కెదౌ।పంచముడనోరుమూయకఁ॥

వశి॥ కొరగాని కూతలేల గూసెవు । పురందరుని మోలనిట్టురా గిరుల్ గుంకి సాగరంబులింకిన । నరాధిపుడు సత్యమాడురా ॥

విశ్వా॥ మహిఁ వెలయుశ్రీ । మకూరబాదా । యహీంద్రభూషుని సాక్షిగా ।మహేంద్రు నెదుటనె ప్రతిజ్ఞజేసెద। మహీపాలు నోడింతుగా ॥

విశ్వా - కందార్థము - జుల్వ.

ఓరి వశిష్టా వినరా । సారసహిత వంశుడౌ హరిశ్చంద్రునితో । యేరీతినైన నేనిక । సారెకు బొంకించువాడ ॥ శపథంబు బూనియుంటి నేడూ । నీయపక్రమమును బయలుపరతు చూడూ । కూరిమి నీశిష్యకోటి జేరిన వాడగుటచేయా । ధారుణిపతి పక్షమయ్యె । యీరీతిగ భాషించెవు ॥శ॥

వశి - కందార్థము - ఆట.

కొంచపు గుణమున పార్థివు । నెంచక నిందించనీకు । నేమి ఫలంబా । యంచిత గుణనిధి యతని వి । రించియు బొంకింపలేడు ॥ నీవెంత పోరా । కౌశికనాతో నిష్ఠూరమేరా । మంచిమాటలచే వచించు చుంటివి నీకు । వంచన పాలయ్యే వదినీవు దెలియావు ॥నీ॥

విశ్వా - కందార్థము — జుల్వ.

అందరు మునీశ్వరులును పు । రందరుడును సురలు నుండ । లావుగ నతనిన్ । డెందమున సిగ్గుజెందక । మందమతీ బొంగిడితీవి । మదువును గొంగ్రిలితివా నోవశిష్ఠా ॥ జ్ఞానమనునది మరచితివా నీతిభ్రష్టా । అందరు విన వానినోట నన్నృతములాడింతుననుచు । బంధురముగ నే ప్రతిజ్ఞ బన్నితి నీవేళవినుము ॥మధు॥

వశి - కందార్థము - ఆట.

దేవేంద్రు నెదుట జెప్పెద । నీవా హరిశ్చంద్రవిభుని । నెట్టుల నైనన్ । భావంబు దొరల జేసిన । మావారలు నన్నుజూచి ॥ మరి ఛీ ఛూ యనగా । జంధ్యముదెంచి । మరినేబోయెదగా । నీవన్న యటు లాను నీవు జేయకయున్న । నీవేమి యోడేవు నిందరు వినదెల్పు । యోవిశ్వామిత్రా । యోచించుకో యోగాధి పుత్రా ॥

విశ్వా - కందార్థము - జుల్వ

నానారీతులొనర్చియు । నేనాతని బొంకసేతు । నిక్కముయటుగా । దేనీగొడ హరిశ్చందుగ్రిన । కేనిత్తును యింద్రపదవీ ॥ యెంతేనియు సంశయింపకాను । రవ్వంతయు నామాట దప్పబోనూ । పంతముతో నాదుతపః ఫలమాతని కర్పించెద । సంతసమున దేవమునీశ్వరులెల్లను మెచ్చునటుల ॥యెం॥

వ॥ అని యిటుల వాదించుచున్న వశిష్ఠ విశ్వామిత్రులం జూచి దేవేంద్రుం డేమనుచున్నాడన.

యిం-గీ॥ మీరలిటువలె వాదింప మేలుగాదు । శాంతిజెందుడు సంధ్యాది సమయమయ్యె । నేటికీసభ జాలింతు మేటిదయను । దలపు డింకను నాపైని ధర్మవిధులు ॥

వ॥ అనిన మునీశ్వరులు మొదలగువారలు తమతమ యాశ్రమం బులకు వెడలిపోవుటయు నంత,



చంద్రమతి వేషం రాకడ.

క॥ శ్రీకాశీ విశ్వేశ్వర । కాకోదర భూషసకల కారుణ్యానిధీ
పాకాసురారి సన్నుత । సాకల్యము నిన్ను మదిలో సన్నుతి జేతున్॥

దర్వు - ఆట.

శ్రీకాశీపురవాస చిద్రూపి హృదయేశ విశ్వనాథా । వో పాకారి వినుత గోపతి వాహనారూఢ విశ్వనాథా ॥౧॥ పన్నగా భరణా యా పన్న రక్షణదేవ విశ్వనాథా । నా । విన్నప మాలించి వేడూకతో బో్రవు విశ్వనాథా ॥౨ కరిచర్మచేలా యో కాలకూటవిభక్ష విశ్వ నాథా । వో దురితాపహార పూర్ణ కరుణసాగర దేవ విశ్వనాథా ॥౩॥ ఫాలలోచన శూల పాణి మృత్యుంజయ విశ్వనాథా । ధీ । లోలా సజ్జనపాల లోకశరణ్యా శ్రీ విశ్వనాథా ॥౪॥ భాసురమౌ మకుర బాద మందిరవాస విశ్వనాథా । భాగ । దాసవందిత చిద్విలాస సర్వేశ్వర విశ్వనాథా ॥౫॥

చె-క॥ గిరిరాజతనయ భర్తను । స్మరియించుచు వేడుకలర । సఖియలతోడ౯ । యరుదేర మీరలెవ్వరో । తెరవెళ్ళియు దెల్పవమ్మ । దివిజులు మెచ్చన్ ॥

చం-క॥ సారసనేత్రిరో నీవును । కోరినయటు తెరనువెళ్ళి । కొమరొప్పగనా । చారిత్రంబును దెలిపెద । సారెకు సభజనులు వినియు సంతసమొంద౯ ॥

## తెరవెడలుట దర్వు - త్రిపుట.

దేవినే । చంద్రమతి దేవినే ॥ దేవిని వినునా భావములోపల । నేవేళను పతిసేవలు గోరెద ॥దే॥ యింతినే । కందర్పునిచేతి బంతీనే । సంతసమునదాసి కాంతలు గొల్వగ । దంతియానమున తరలిటువచ్చితి ॥ దే॥ శీలానే । సద్గుణముల జాలనే । మేలు మశూరబాధ పోగ్రిలులో వెలసిన । కాలకంధరుని లీలలు గోరెటి ॥యిం॥

## ద్వి ప ద

వినుగజయాన నా విధమెల్లనీకు । పనిబూని వినుపింప పందువైదోచు । ధరలోన నయోధ్య పురము మాయూరు । తరమె వర్ణింప భూతలదాల్పుకైన కోటలు పేటలు గోపురంబులూను । నీకైన భవనముల్ నిగనిగ మెరయు । చంపక సురపొన్న జాజితోటలూను । యింపైన కొలనులు యెందుజూచినను । రథగజ తురగముల్ రమణీయ భటులు । చతురత గల్గిన జనసమూహంబు । వేదశాస్త్రపురాణ విధులు భూసురులు । సాధుసత్పురుషులు శాంత హృదయులును । శస్త్రాస్త్ర విద్యలో చతురులైనట్టి । శాత్రవ భీకరుల్ క్షత్రియోత్తములు । అల కుబేరునకైన నప్పిచ్చునట్టి । సలలితవైభవుల్ సద్వైశ్యజనులు । సేవక వృత్తిలో జీవించునట్టి । భావశుద్ధియుగల్ల బలుశూద్రజనులు । ఆపట్టణము నేలు నతివైభవమున । భూపాలవర్యుండు భూరివిక్రముడు ।సత్యసంధుడు హరిశ్చంద్ర భూవరుడు । నిత్యసద్ధర్మంబు నెరవేర్చువారు । నాప్రాణ నాథుండు నాతిరో వినవే । యెప్పొద్దు మశురబాదీశుని దలతు ॥

## దర్వు - ఆది.

మతిమంతురాల వినవోయమ్మా । నాపేరుచంద్ర మతియాని యందురే ముద్దుగుమ్మా ॥ సతతము నాదగు పతిశ్రీపతియని । పతివ్రతనై వేర్పడగ జరించెద ॥మ॥ హాటకాంగిని వినవోయమ్మా । నాసరివారలో మేటివహించిన దానవమ్మా । పాటలగంధిరో పరిచారకులతో నీటు గుల్కగను నిటకేతెంచితి ॥మ॥ తనయుండు లోహితాస్యుడమ్మా మా వైభవమెన్న తరమా రవివంశజులము మేమమ్మా । పనిబూని మశుర బాధల్లో వెలసిన । మనసిజ వైరిని మదిలోదలచెద ॥మ॥

వ॥ అని చంద్రమతీదేవి యిటుల వచించి వెడలిపోయినంతలో,



—( హరిశ్చంద్రుని వేషం రావడం )—

కం॥ శ్రీకైలాసనివాసా । పాకారి ప్రముఖవినుత । పన్నగభూషా
లోకేశ్వర పరమేశ్వర। నీకుఁ మ్రొక్కెదనునన్ను నేలుము శంభో॥

దర్వు - ఆట.

రాజరాజనమించెనూ । శ్రీమదయోధ్య రాజేంద్రు డేతెంచెనూ । రాజసన్నిభమైన తేజంబు విలశిల్ల । భూజనములనేలె పుణ్య చరిత్రూడు॥ రా॥ మణికిరీటము దాల్చెనూ । కుండలమలాల । మహాకాంతి శోభిల్లనూ। దినమణి వంశూడు ధీజన లోలుడు । మనసీజరూపుడు మంజులభాషుడు ॥ రా॥ మతిమంతులౌ మంత్రులూ । వెంబడిరాగ । చతురత గలశూరులూ। హిత పౌరోహితులు సద్గతి దెల్పుచుండాగ । కుతుకంబుతోడ తానతి వైభవంబూన ॥రా॥ వారాంగనలునాడగా । వరుసతో జయ । భేరీధ్వనులు మోృయగా । ధీరోధాత్తుడు సద్విచారుడు శూరుడు । పారవార గంభీరము తోడుత ॥రా॥ ధరణీలో నుతికెక్కినా । మశూరబాద । పుర మందు విలసిల్లినా । గిరిరాజవరపుత్రి । వరప్రాణలోలూని । స్మరణయే మారక సభకు జేరగనేడు ॥రా॥

ద్వా-క॥ కంతుజయంత వసంతుల । కాంతిని మరపించుదేవా । కళగుల్కెడు భూ । కాంతులుమీ రెవ్వరొకో । సంతోషముతోడదెల్పు సభవారు వినఁ ॥

తెరవెడలుట - దర్వు

రాజా । హరిశ్చంద్రమహా । రాజా ॥ రాజరాజమహా రాజకంఠీ రవ । భూజన వినుతుడ పుణ్యాచరిత్రుడ ॥రా॥ శూరా । శత్రుజన గర్వ హారా । మేరుగోత్రి సమధీరవార్ధి గంభీరవీర । శృంగార శరీరుడ ॥రా॥ శీలా । అయోధ్య నగరీ పాలా । మేలుమళురబాద ప్రోలులో వెలసిన ఫాలలోచనుని భక్తియుక్తుడను ॥రా॥

హరి - ద్విపద

వినర ద్వారకనాదు వృత్తాంతమంత । పనిబూని నీకునేర్పడదెల్పె దాను । మాయూరు నయోధ్య మహానగరమంద్రు । దేవేంద్ర పురి వోలె దీపించుచుండు । ద్వాదశి యోజనాల్దనర విస్తీర్ణ । మేదిశగన్గొన్న నెంతో వైభవము । సదమల వేదశాస్త్రప్రౌఢులైన । చదువనేర్చినయట్టి సద్బ్రాహ్మణులును । గజవైరితోనైన కదనంబుజేయు భుజవిక్రమోన్న తుల్ భూరిక్షత్రియులు । అలకాధిపతిసరి దులదూగుచుండు । సలలిత వైభవుల్ సద్వైశ్యజనులు । సేవకవృత్తిలో స్థిరత చరించు । భావశు ద్ధియుగల్ల బలుశూద్రజనులు । యిటువంటిరాజ్యంబు నెల్లవేళలను । పటుతరంబుగనేలు ప్రభుడనువినర। అత్యంత ప్రియముతో యవనీజనులును। సత్యవంతుడు హరిశ్చందుడటంచు। నిన్ను బిలచెదరు నా నాతిచంద్రమతి। నన్నుతాంగియుమహా సాధ్వీలలామ । సుతుడు లోహితుడు వాడతి సుందరుండు । సతతంబునామది సర్వేశుదలతు ॥

దర్వు - అది.

సూర్య వంశాంబుధిపూర్ణ చంద్రుడా । సత్కార్యాచరణుండ నునే హరిశ్చంద్రుడా । శౌర్యధైర్య సాహస వర్యుడనౌ । దార్యగుణుం డను నమితయశుండను ॥సూ॥ సత్యవాక్పాలన తత్పరుండరా । అత్యంత సమృద్ధి వైభవుండరా । నిత్యానిత్య వివేకమతుండను దైత్యాదమనుడను ధరణీశ్వరుడను ॥సూ॥ మారశతకోటి విజితగాత్రుడా। అసమాననీయుండ త్రిశంకుని పుత్రుడా । మేరుగోత్రసమధీరుడ వీరుడ । పారావార గంభీర హృదయుడను ॥సూ॥ ధరణి మళూరాబాద వాసుని । నేదలచెదనెపుడు శ్రీవిశ్వేశుని । వరుసతో నాసరి వారలు భళియన । కరమొప్పగసభ కరు దెంచితి నిటు ॥సూ॥

హరిశ్చంద్రుడు - సభ జేయుట-దరువు

సభ జేయుదామిప్పుడూ । మంత్రివర్య । సభ జేయుదామిప్పుడూ యుభయ పార్శ్వములందు నుచితాసనంబుల । సభచరల్ గూర్చుండ రభసంబు తోడుత ॥స॥ పండితుల్ కవివరులు । గాయకసత్య । మండితుల్ భూసురులు । నిండువేడుకతో యాఖండ వైభవమొప్ప । మండలేశ్వరు లెల్ల మరిమరిబొగుడాగ ॥స॥ వారాంగనలు నాడగా సారెకుజయ । భేరి ధ్వనులు మ్రోగగా । కోరిశతృలయొక్క గుండె లవిసిపోగ పార వార గంభీరము విలసిల్ల ॥స॥ ధరణిలో నుతికెక్కినా । మధురబాద । పురమందు విలసిల్లినా । సరసిజారిమౌళి చరణ పంకజమూల పరిపరి విధ మూల బ్రస్తుతి జేయుచు ॥స॥

వ॥ యిటుల నా హరిశ్చంద్రభూపాలుడు సభజేసి కూర్చుండి తన మంత్రియగు కీర్తి శేఖరుని జూచి యేమనుచున్నాడన.

వాదం - ఆట

రా॥ మనయూరిజనులు క్షేమముగా నున్నవారే కీర్తివంతా । నే వినగోరువాడను వినుపింపుమిప్పుడు కీర్తివంతా ॥

మం॥ మీయొక్క కృపవల్ల మేదిని జనులంత రాజవర్యా । వార లేయపాయములేక నింపూతోనుండిరి రాజవర్యా ॥

రా॥ జార చోరులబాధ బారదోలియు భటులు కీర్తిసేఖరా । యాజ్ఞ । మీరక వారెల్ల మెలగుచుండిరెదెల్పు కీర్తిశేఖరా ॥

మం॥ జగదీశ మీయాజ్ఞ శిరసావహించియు రాజవర్యా । వారు మిగుల జాగ్రతతోడ మెలగుచుండిరయ్య రాజవర్యా ॥

రా॥ వలనొప్పమనకు లోబడియుండు రాజులు కీర్తిశేఖరా । కప్ప ములు గట్టుచుండిరే యలజడియునులేక కీర్తి శేఖరా ॥

మం॥ హరిభీకరులు మీరలానతిచ్చినయట్లు రాజవర్యా । యా ధరణీ పాలురకిస్తు ధనము జెల్లించిరి రాజవర్యా ॥

రా॥ భాసూరమౌ మధుర బాదలో వలసిన కీర్తిశేఖరా । చిద్వి లాసుడైన నిటలాక్షుడె మముబ్రోచు కీర్తిశేఖరా ॥

వ॥ అని యిటులనుచున్నంతలో విశ్వామిత్రుం డరుదెంచినంజూచి

యెదురేగి యర్ఘ్యపాద్యాది విధులంబూజించి హరిశ్చంద్రభూపాలుం డేమనుచున్నాడన.

హరి-కం॥ దండము గాధికుమారా। దండము కరుణా సముద్ర। తాపసచంద్రా। దండమఖండల పుణ్యా। దండము శాంతి స్వభావ దండము స్వామీ॥

వి-క॥ వర్ధిల్లుము హరిశ్చంద్రా। వర్ధిల్లుము భానువంశ వారధి చంద్రా। వర్ధిల్లు ధర్మరక్షణ। వర్ధిల్లుము నీకు శుభము। వర్ధిల్లు భువిన్॥

వాదం - దర్వు - ఆట.

రా॥ మీరిందు వచ్చుట మిగుల శుభంబాయె తాపసేంద్రా। నా కోరిక ఫలియించె కొనసాగె పుణ్యంబు తాపసేంద్రా॥

వి॥ ఘనమైన నొకకార్య మునుగల్గి వచ్చితి రాజచంద్రా। నే వినుపింతు నాయొక్క విధమెల్ల నీకును రాజచంద్రా॥

రా॥ మీరు గోరినకోర్కె మేరనొప్పదీర్తు తాపసేంద్రా। నో కారుణ్య హృదయనే కల్లలాడగబోను తాపసేంద్రా॥

వి॥ క్రతువొక్క టొనరింప కాంక్షనామదిగల్గె రాజచంద్రా। అందు కతిథినై నీవద్ద కరుదెంచినాడను రాజచంద్రా॥

రా॥ యేమి గావలెమీకు యేర్పరించుడి నాకు తాపసేంద్రా। నే ప్రేమతో నొసగెద స్వామియీక్షణమందె తాపసేంద్రా॥

వి॥ ద్రవ్యవాంఛచెనిందు దరలి వచ్చినాడ రాజచంద్రా। నీ యవ్యయ గుణమూకు నానందమొందితి రాజచంద్రా॥

రా॥ వలచినంత ధనము గొలచుక। పొండయ్య తాపసేంద్రా।యీ యిలను మశురబాద యీశుడు మెచ్చగ తాపసేంద్రా॥

వ॥ అనిన విశ్వామిత్రుం డేమనుచున్నాడన.

క॥ కరిపై నెక్కి నరుడు నిజ। కరమున మాణిక్య మెగురగా వైచిన నెం
తరుగునొ నింతటిద్రవ్యము। ధరణీశ్వర యొసగునాకు దానంబనుచున్॥

వ॥ అనిన హరిశ్చంద్రుం డేమనుచున్నాడన.

క॥ సరెసరె కొంచమునకుమీ। రరుదెంచితిరేల శిష్యు నంపించినచో
మరిమీదు యాజ్ఞదప్పక।కొరతేమియులేకధనము కోరినొసగుదున్॥

వాదం - దర్వు.

హా॥ కోరినంత ధనమూ । నొసగెద । కొనుడిదె మునివర్యా । సారెకు మీపద సరసిజాతముల సన్నుతి జేసెదనూ ॥

వి॥ భళిభళిమెచ్చితినీ । సీధృఢ । భక్తికినామదినీ । యిలలోనీవలె భూపాలునినే నెందుజూడలేదూ ॥

హా॥ పరమ తపోధనులూ । ననుగొ । ప్పగదల్చకుడికనూ । కరువు దీర మీ కోరిన ద్రివ్యము । గై కొను డొసగెదనూ ॥

వి॥ కావలసిన యపుడూ । వచ్చియు । గై కొనిపోయెదనూ । భూవర నప్పటి వేళల నీవిక బొంకవలదు వినుమీ ॥

హా॥ పలికి బొంకుటకునూ । నేమహ । పాపమనెంచెదనూ । కలలో సైతము నెంచకు డటువలె । కరుణాకరమీరూ ॥

వి॥ భాసురమైనట్టి । మహిరా । బాద మందిరుండూ । వోసుగుణా కర నిన్ను బ్రోచును । వొప్పుగ నెప్పుడును ॥

వ॥ అని పలికి విశ్వామితు్రిండు అటనుండి వెడలి మాయమృగం బుల సృజించి అయోధ్యాపుర ప్రాంతంబుల నుండెడు పైరు పంటలపై బారవిడచిన కర్షకులా బాధలకు తాళజాలక.

దర్వు॥ రావోయి పోదాముమనము రాంరెడ్డి । మన । రాజుగారి వద్దకిపుడు రంగరెడ్డి । పారోయి యీజంతువూల । బాధలు లావాయె మనకు । పైరుపంటలన్ని వేగ పాడయ్యె ప్రొద్దునేడు ॥రా॥ జొన్నచేను లన్నినేడు చెన్నరెడ్డి । పంది । గున్నపాలయ్యెసుమ్మి గోపిరెడ్డి । అన్న లార రబ్బిపంట మన్నులోన గలసిపోయె । యెన్నడిట్టి కరువుకాల మెరు గము యిన్నాళ్ళవరకు ॥రా॥నక్కలూ తోడేళ్ళబాధ చెన్నరెడ్డి । నే । నెక్కడాను జూడలేదు యెంకిరెడ్డి । దుక్కినట్టి పొలముజూడ దుఃఖ మొచ్చుచుండెనాకు । మక్కచేసులన్ని నొకటి దక్కకుండ చేటునొందె ॥ రా॥ ధారుణీ మహూరబాద ధర్మరెడ్డి । యా । మారసంహారూని దలచీ మల్లరెడ్డి । యేరీతిగ సైనరాజు వేటకూబైలెల్లుమనుచు । సారె సారె కూను వారి చరణమూల నొరుగుదాము ॥రా॥

వ॥ అని యిటులిరుదెంచి కాపువారు హారిశ్చంద్రుని పాదంబులపై బడి యేమనుచున్నారన.

రాజుకు రైతులకు వాదం - దర్వు - ఆట.

కా॥ దండము దండాము మీకు రాజవర్యా । మా । గండములను కడతేర్చాడి రాజవర్యా । పుండలేము వుండలేము యూరిలో నిన్నాళ్ళ వలె । దండిగా రక్షించుమాకు దారిదోచకుండెనయ్యా ॥దం॥

రా॥ భయము జెందబోకుడీ వో కాపులార । మీ । కభయమిచ్చి నాడనిదుగో కాపులార । రయముతో వచియింపుడీమీ రాకడేమొ తెలియదాయె । నయముగూర్చు వాడమీకు । నమ్మడీ నావాక్యములను ॥

కా॥ క్రూరమృగము లెల్లవచ్చి రాజవర్యా । పంటలు । కొల్ల బెట్టుచుండెనయ్యా రాజవర్యా । యేరీతిగ తాళుదూము । యేమిసేతుమయ్యామేము ।మా రాజా మాబాధమాన్పి మమ్ముల రక్షింపుమయ్యా ॥

రా॥ అంతమాత్రమున కేమీరు కాపులార । మదిలో । చింతనొందతగదుమీకు కాపులార । పంతమూతో వేటకునే బైలువెడలి వచ్చి వాటి । నంతుజూపెదానుమీకు సంతసంబు గూర్చెదాను ॥భ॥

కా॥ పన్నులెట్లు గట్టుదుమయ్యా రాజవర్యా । వొక్కపైసచేత లేదుమాకు రాజవర్యా । యెన్నడైన యిట్టియాప దెరుగజాలమయ్యా మేము । కన్నతల్లిదండ్రివినీవె కరుణజూడు మ్రొక్కెదాము ॥దం॥

రా॥ పన్నులడుగ బోనుమిమ్ము కాపులార । మీకున్నవేళలో జెల్లింపూడి కాపులార । పన్నుగా శ్రీమళురాబాద పార్వతీశుల పాద్మపద్మము । వున్నదీ నేమరువకామీ । కున్న వెరపు దీర్చువాడ ॥భ॥

హా-వ॥ కాపులారా భయంబుడిగి మీమీగృహంబులకు బొండు నేను రేపే వేటకరుదెంచి యామృగంబుల నన్నిటి ద్రుంచుదునన యా కాపులు వెడలిపోవుటయు నంత మంత్రింజూచి.

హా-గీ॥ మంత్రిశేఖర వినునేడు మనమువేట । కరిగి దుష్టమృగంబుల దరిమి జనుల । భయము వెసదీర్చి వత్తమీ వార్తనిపుడు । పట్టణంబున జాటింప బంపుమీవు ॥

వ॥ అనిన మంత్రివర్యుం డట్టుతేయని వెడలిపోవుటయు నంతలో చంద్రమతీదేవి యరుదెంచి భర్తతో నేమనుచున్నదన.

చం-గీ॥ ప్రాణనాయక మీపాదపద్మములకు । దండమర్పించుదానను దయతోనాదు । మనవి యాలించి మన్నించి మదిలో గల్ల । చిన్నికోరిక దీర్తురం చెన్నుదాన ॥

హా-క॥ మానినిమణి నీమది నను । మానంబును జెందబోక మది గల కోర్కెల । యేణాడి విన్నవించుమి । పూనికతో దీర్చువాడ । పొలుపొందంగ౯

వాదం - దర్వు

చం॥ మృగవేటలాడగ మీరువెళ్ళెదరని ప్రాణనాథ । దాసి మగువ లందరుబల్క మరినేను వినియుంటి ప్రాణనాథ ॥

రా॥ దుష్టమృగములు ప్రజల కష్టపెట్టుచునుండె ప్రాణనాయకీ । వాటి । నష్టంబు గావించి నరుదెంతు త్వరలోను ప్రాణనాయకీ ॥

చం॥ వచ్చెద మీవెంట వనవిహారముసేయ ప్రాణనాథ । నే । నచ్చటి వింతాలు నరయాగ మదిగోరె ప్రాణనాథ ॥

రా॥ వలదు నాతోగూడ వచ్చుట తగదేవో ప్రాణనాయకీ । యా ఖల మృగంబులజూచి కాంతరో జడిసేవు ప్రాణనాయకీ ॥

చం॥ మీరుయుండగ భయ మేలగల్గునునాకు ప్రాణనాథ । వో ధారుణీశ్వరనాపై దయదల్పు మ్రొక్కెద ప్రాణనాథ ॥

రా॥ ఘోరాటవులదిరుగ కోర్కె నీకదియేల ప్రాణనాయకీ । త్వరలో । జేరవత్తునిందు సారసనయనీవో ప్రాణనాయకీ ॥

చం॥ క్షత్రియ కులమందు జనియించియుంటినీ ప్రాణనాయకా । స । క్షత్రియపతిమీదు సతినయ్యి జడిసేన ప్రాణనాయకా ॥

రా॥ మగువ నీమాటకు మదిసంతసంబాయె ప్రాణనాయకీ । నిన్ను । జగతీ మహారబాద జగదీశ్వరుడె బ్రోచు ప్రాణనాయకీ ॥

రాజు - కందార్థము - ఆట

వనితామణి వినుమిప్పుడు । వనికిని నావెంటనీవు । వచ్చుట తగునే । వనరుహాలోచన యందలి । ఘనమృగముల జూచిభీతి ॥దర్వు॥ గనియెదవబలా । నామాటలు వినుగుణశీలా ॥మిత్ర॥ యినుడుగ్రుంకక ముందెవచ్చెద । ననువునను సంతోషమొప్పగ । మనమునను బెగడొంది మృగ గర్జనల నీవును వినియుభీతి ॥గ॥

చంద్రమతి - కందార్థము - ఆట.

భూపాల కులశిఖామణి । యేపొద్దును నిన్నుబాసి । యెరుగను మదిలో । కోపము సేయక నన్నీ । పాపని విడనాడ దగునె । పాపవి

దూరా। నాపై దయ జూపుసుధీరా॥ మీపదంబుల యానసేనీ ప్రాపునను జనుదెంతుమృగము... । రాపుజేసిన వెరువనకలననీవ కావున వోపననకుమ ॥పా॥



రా-వ॥ మానినీ చింతిల్లకుము అటులే దోడ్కొనిపోయెదను అని యిట్లు సంభాషించుచున్నంతలో.





—( లోహితాస్యుడు రాకడ )—

క॥ శ్రీపార్వతీమనోహర । పాపౌఘ వినాశయీశ పన్నగభూషా
గోపతివాహననినుమది । యే ప్రొద్దుస్మరించువాడ యేలుమినన్నున్॥

ద రు్వ.

బాలుడనువినరా । హరిశ్చంద్ర భూ । పాలు తనయుడరా । శీలుడ సజ్జన లోలుడ దుర్జన । కాలుడ మదనుని బోలు సుందరుడ॥ బా॥ నీతి పరుడనురా । చంద్రమతిగర్భ । జాతుడనుగనరా । భూతల మునసను బోలువారలలో । ఖ్యాతివహించితి ప్రీతిదనరగాను ॥బా॥ ధీరుడనువినరా సకలవిద్యలలో । శూరుడనుగనరా । ధారుణి వెలసిన దండి మశూరబాద । మారసంహరుని మరిమరి దలచెద ॥బాలు॥

రా-వ॥ అయ్యా బాలభానునితో సమానమగు నీదేహకాంతులుప్పొంగ సింగంపు పిల్లవలె గంతులు వైచుచు యిందరుదెంచిన నీవెవరో విన జేయవయ్యా బాలకా వేసారకా.

లోహితుని - దరు్వ - ఆది.

హరిశ్చంద్ర నరవరూని తనయుడ మరున్మించులోహితుండరా। ధరాపతి సుతులు నిరంతరమునను । స్థిరంబునను బొగిడేరురా ॥హ॥

హితమతి దయామతీయైన చంద్ర । మతీదేవి సూనుండరా । స్థిత ప్రజ్ఞ గల యతీంద్రుపదముల । మతిన్నమ్మి చరియింతురా ॥హా॥ సతంబుమది సూనృతంబు గోరుచు । ధృతింజెలగ నేనుందురా । క్షితిణ మసురబాధ శితగ్రీవునిం । స్తుతిన్ సల్పుచుండేనురా ॥హా॥

వ॥ ఇటుల లోహితాస్యుం డరుదెంచి జననీ జనకులంజూచి యే మను చున్నాడన.

లోహి-కం॥ దండము జనకానికిదె । డండము ననుగన్న తల్లి । దయగుణశాలి । దండిగ దీవించుడి మీ । యండకు నిటుజేరినాడ । యతి ముద మొప్పన్॥

హా-వ॥ చిరంజీవ స్సుఖీభవ.

చం-వ॥ తనయా చిరాయుష్మంతుడ వగుదువుగాక.

హా-గీ॥ బాలరాజ ధనువు బాణంబులనుబూని । వచ్చుటేల నిందు వాంఛతోడ । విన్నవించుమాతో వేడుక లలంగ । నిందు నాదు ముద్దు నందనుండ ॥

లోహి-గీ॥ వేటకేగెదు నాబోటివీరులెల్ల । తగిన సాధనములు లేక దరలుటెట్లు । గానమీతోడ గూడినే కదలుటకును । వాంఛతోడుత మిముజేర వస్తిజనకా॥

వ॥ అన హారిశ్చందుఁడు సంతోషచిత్తుండై తన మంత్రింజూచి యేమనుచున్నాడన.

హా-గీ॥ సత్యకీర్తివేట సన్నాహాములతోడ । నడవికరిగి మనము ఘడియలోన । మృగసమూహాములను దెగటార్చివత్తము । రధము నడుప వయ్యె రాజితముగ ॥

వ॥ అని యిటులా హరిశ్చంద్రుండు భార్యాపుత్రుల దోడ్కొని భట సమూహంబు గూడి కాంతారంబు బ్రవేశించి చంద్రమతితో యేమనుచున్నాడన.

హరి - దర్వు - ఆది.

కనుగొంటివె యీకాంతారంబున ।గలవింతల నన్నియు కాంతా । ఘనవృక్షంబులు ఫలపుష్పంబులు । కనుటకింపుదోపగ నంతా ౧॥ శరభ సింహ శార్దూలంబుల ఘీంకరములు వీనుల సోకంగణ । సరసీరుహ

లోచని భీతిల్లకు । శరముచెవాటిని బడవైతున్ ॥౨॥ శుకపిక శారిక చకోరమంజుల । బకమయూర కలకలరవముల్ । వికసిత సుమముల వాసనఘుమ్మని వీవగ చల్లని వాయువులన్ ॥౩॥ కరువుదీరె నీకాంతా రముగన కాంతాముదుకు నరుగవలెన్ । ధరణిలో వెలసిన మశురబాద పుర ధవళాంగుని నెదనమ్మియునూ ॥౪॥

వ॥ యిటులా హరిశ్చంద్రుండు వేటలాడుచు బోవుచున్నంతలో వశిష్టుండు ప్రత్యక్షమై నిలచినంజూచి.

హ-క॥ వందనముసద్గురూత్తమ।వందనమిదె మీదుపాద వనరుహములకున్
యిందునమీరగుపడనా। డెందముయానందమయ్యె యతికులతిలకా॥

వశి-గీ॥ ఇనకులోత్తమ యింత దవ్వేలనిప్పు । డరుగుదెంచితివీవు నీ యబలతోడ గాధిసూనుడు మిమ్ములబాధజేయ । దలచియుండెను పురికేగు తడవు వలదు ॥

వ॥ అని యిటుల వచించిన హరిశ్చంద్రుండు మహాప్రసాదమని అటనుండి వెడలిపోయి నొకచోట మార్గాయాస బడలిక దీర్చుకొనుటకై యందరు శయనించి యుండుటయు నంతలో విశ్వామిత్రుండు తనమదిలో నేమనుకొనుచున్నాడన.

విశ్వా - దర్వు - ఆది.

ఏరీతి మాయా బన్నుదూ । హరిశ్చంద్రునితోనే । నేరీతి బొంక జేతునూ । మేరలేని ధనముగోరియుండిన భూరమణుండిత్తు నాని బల్కెను । యేరీతినైన రాజ్యముగొని । కారవుల పాల్జేతు విడువకను ॥ ఏ॥ వాసవునీ యెదుటా నేనికా। వశిష్టునితోడ । బాసజేసితినీ విడువకా। దోసకారియా భూసుర జ్యేష్టుడు । వాసిగనేవిధి జేసునో దెలియదు ॥ఏ॥ హెచ్చుబాధలనూ బెట్టెదా । భూపాలుని కింగల । మచ్చర మొదులా జేసెదా । అచ్చుగాను మశురాపురి వెలసిన । అచ్యుతు సఖునే నెచ్చుగ దలచెద ॥ఏ॥

సీ॥ పరమేష్ఠి తనయుని బాధల పలయించి । పుత్రశోకాబ్ధిలో ముంచినాడ । స్థూలదేహముతోడ జూడ త్రిశంకుని । పరగ స్వర్గంబుకు బంపినాడ । విరివిగా గలిగెడు విఘ్నంబులకునోర్చ । బ్రహ్మచారని పేరు వడసినాడ । ధాతకు బదులుగా ధరణీతలంబున । జీవకోటుల

సృష్టి జేసినాడ ॥ అంబరీషుని యశ్వమేధంబు ఫలము । స్థిరముగానిచ్చి యాశునశ్శేనునకును । చిరతరాయువు నొసగితి ధరణిలోన । నీ హరిశ్చంద్రుడు బొంకించు టెంతఘనము॥

వ॥ అని తన మాయవలన యిరువురు మాతంగ కన్యల నిర్మాణించి పంపె నెటులన

—( మాతంగ కన్యలు రాకడ - దర్వు - అట. )—

మాతంగ స్త్రీలము మేము । దనుజా । రాతికోడలిబోలినాము। ప్రీతితోడుతమమ్ము విశ్వామిత్రుడుతాను । భూతలమందున బుట్టించెవిన రమ్మా ॥మా॥ జలజారి సరిబోలు మోము । దేహ । కళలు బంగరు తీగెసమము । వెలయ మాపాలిండ్లు విరిబంతులనుబోలు । గళముశంఖ ముతావి । కస్తూరి మరపించు ॥మా॥ నవమోహనా కారులాము । పల్లవపాణులము యలివేణులము । ప్రవిమలమౌ చిల్క పల్కులు బల్కుచు । భువినాథునకుప్రీతి బుట్టింపవస్తిమి ॥మా॥ ధరణి మకుర కారయందు । గౌరి । ధవునీ మాహృదయంబునందు । మరిమారి దల చూచు మరియిందువస్తిమి । కరియానమొప్పగ కాంతులూరగ వేగ ॥

చె-క॥ మదనునిసతివలెదోచెదు । సుదతులుమీరెవ్వరమ్మ సుందరగాత్రుల్
మదిలోన భేదముంచక। ముద మొప్పగ దెల్పరమ్మ ముచ్చటదీరన్॥

మా-క॥ తరుణీ విశ్వామిత్రుడు । ధరణిలో మము సృష్టి జేసి । తరణి కులుండా । హరిశ్చంద్రుని బొంకింపను । సరగున యిటుదోలె మమ్ము । సారసనయనీ ॥

మా - దర్వు - ఆది.

ఎందుబోదుమూ । రాజు । నెందుజూతుమూ । మందగమనా తాళలేము మారునీ బారికిమేము । పొందుగాయూ భూవరుడెంతోయంద గాడని వస్తిమిందు ॥ఎం॥ భానుకుల పావనుని మేము పరిణయమాడియు వేగ । శూనశరునీ కేళిదేలి । సుఖముగుదువ వస్తిమిందు ॥ఎ॥ భాసుర మైనట్టి మకురా । బాదలో నెలకొన్నయట్టి । వాసవవందితుని నమ్మి వాంఛతోడ వస్తిమిందు ॥ఎం॥

వ॥ ఇటులా మాతంగకన్యలు హరిశ్చంద్రుని వెదకుచు వచ్చు

చున్నంతలో యిక్కడ హారిశ్చంద్రుండు స్వప్నముగాంచి చంద్రమతితో నేమనుచున్నాడన.

వాదం - దర్వు - ఆట.

హ॥ కలగంటి నే ప్రాణకాంత । నాకు । దెలుప శక్యముగాదు వింతా । కలికిరో నామనసు తలుకు బెళుకులాయె । పలుక నోరాడదు పరమేశ్వరునిమాయ ॥కల॥

చం॥ యేమి కలగంటిరి స్వామీ । నాతో । నెరిగింప కున్నార దేమీ । నామది తొందర నాయను మిముజూడ । భూమీశ యిటులేల భుగులు జెందెదరయ్యా ॥

హ॥ యెటులా నీతోడ దెల్పుదునూ । వో । యెలనాగ విధి కృతము నేనూ । పటుతర కోపుడై బాపడొక్కడువచ్చి । కటకట మకుటాము కాలదన్నినయట్లు ॥కల॥

చం॥ యిదియేమి వరపు ప్రాణేశా । మది । జెదర నాయను దురిత నాశా । సదమల మతుడవు సంపత్కరుడవీవు యదరకు చెదరకు బెదరాకు మదిలోన ॥యే॥

హ॥ మనరాజ్యమెల్లనో శీలా । నొక్క । మౌనికర్పణ జేసి నటులా । వనజాక్షి వినుమన । మొంటివస్త్రములాతో । వనవాస దుఃఖంబు లనుభవించినతీరు ॥క॥

చం॥ సత్యసంధుడవీవు రాజా । అసత్య మాడవు కల్పభూజా । నిత్యవైభవమూతో నిలుయేలువాడవ । గత్యంబు మీకేమి కలుషంబు లంటవు ॥యే॥

హ॥ ధరణి మళురబాద వాసూ । గౌరీ । ధవుడైన చిదచిద్విలాసూ । కరుణాచే మనరాజ్య కలిమి యెప్పటి యట్లు । మరల గల్గిన యట్లు మగువనే నిప్పట్ల ॥కల॥

వ॥ ప్రాణేశ్వరా యిదియెల్లయు విశ్వామిత్రుని మాయోపాయంబులని దోచుచున్నది మనమిట నుండతగదు అని అనుచున్నంతలో మాతంగ కన్యలరుదెంచి యేమనుచున్నారన.

మా-ఉ॥ ఓనరనాథ చంద్రవిను । ముజ్వల వైభవ సాంద్రచంద్రికా
నూనయశో విశాలఘన । నూతన భూషణ జాలసత్యసం
ధాన విచక్షణాశ్రితని । ధాన ప్రభాకర తేజ నిత్యముా
దీనులపాలికల్ప సు । ధీజన ప్రొమొక్కెద మాదరింపవే ॥

మాటలు

హా॥ నారీమణులారా మీరెవ్వరు మీ నామధేయంబులెవ్వి యిట కెందునిమిత్తమయి వచ్చితిరి.

మా॥ రాజేంద్రా మేము మాతంగకన్యలము.

హా॥ నానుండి మీకేమి కావలయునో కోరుడు.

మా॥ మహాప్రసాదము.

వాదం - దర్వు - రూపక.

మా॥ భూవర మము గూడుడినే । డీవనమందున వేడ్కతో భావజు బారికి నోర్వము । పాలించుడీవేగా ॥భూ॥

హా॥ హరిహరి మీరెరుగక యిటులాడగ జెల్లునె యిప్పుడు । కరిగమనులార మీరరుగుడి యిటునుండీ ॥హ॥

మా॥ వలచీ వచ్చినస్త్రీల వద్దని పల్కుట ధర్మమ । వలరాజు శరములకిక నిలువలేమయ్యా ॥

హా॥ పల్లవముఖులారానే । పరవనితల గాంచియునా । యుల్లములో నెంచెద నాతల్లులవలె నెపుడూ ॥

మా॥ కోరిన కోర్కె లొసంగుట । ధారుణిపతి నీబిరుదము । నారిమణులము మమ్ముల దూరకు మ్రొక్కెదమూ ॥కో॥

హా॥ అన్నము వస్త్రము భూషణ లన్ననునే నొసగెదనో । యన్నుల మిన్నలు కోరుడి యభిమతమును దీర్తూ ॥

మా॥ చక్కనిదొర నీవిక మము । చక్కెర విల్తుని కేళిలో । మక్కువ దీర్చుడి మాకిక యెక్కువపని లేదూ ॥చ॥

హా॥ తగదని దెల్పిన వినరిక । దండించెద మిమ్ములనే । జగతీ మకురాబాద । నగర వాసునిసాక్షి ॥త॥

హా-గీ॥ దర్శనస్పర్శనములకు దగరుమీరు । మీకు । గొగలి యిమ్మన్న మెలతలార । పలుక నాలుక లెట్లుండె భయము లేక । తెలియా మీజాతి యెంతో బుద్ధియును నంత ॥

వాదం - దరువు ఆట.

మా॥ నవమోహనాకార న్యాయమ యిటులాడ రాజవర్యా। వో రవివంశోత్తమమాతో రతికేళి గూడుమి రాజవర్యా॥

హా॥ భయములేక మీరు బల్కితె మిమ్ముల భామలారా। నే దయదల్పకను వేగ దండింతునిప్పుడె భామలారా॥

మా॥ మరుబారి కోర్వక మరణించెదామయ్య రాజవర్యా। నీవు కరుణించిమాయొక్క కాంతులీడేర్పుము రాజవర్యా॥

హా॥ కులహీనతకు దగ్గ గుణము జూపుట మీకు భామలారా। మీ। వలపు మిమ్ముల పలచు వాని జూపుడి భామలారా॥

మా॥ కోరివస్తిమి యింత। కోపమెందుకు నీకు రాజవర్యా। వో వీరుడ మమ్మిట్లు వెడలగొట్టెదవేల రాజవర్యా॥

హా॥ మంచిమాటలచే వచించితి వినకున్న భామలారా। మిమ్ము వంచించెదను రుషివరులెల్ల మెచ్చగ భామలారా॥

మా॥ పురుషుడవై యిట్లు పరుషోక్తులాడుట రాజవర్యా। యీ ధరణీ మకురబాడ ధాముడు మెచ్చునా రాజవర్యా॥

వ॥ అని యా మాతంగ కన్యలు బలిమింబై బడ బోగా హరిశ్చంద్రుండు మంత్రింజూచి యేమనుచున్నాడన.

హా-గీ॥ మంత్రివర్యాయిట్టి మాతంగకన్యలు। మంచిమాటలకును కొంచమైన। వినకయున్నవారు వెడలగ మెడబట్టి। నెట్టివేయుమింక నిట్టుదనర॥

వ॥ అనిన రాజాజ్ఞ ప్రకారంబుగా మంత్రివర్యుండు వారలంగొట్టి నెట్టివేసిన యా మాతంగకన్యలు దుఃఖపూరిత నయనంబులతో విశ్వామిత్రునిం జేరబోయి యేమనుచున్నారన.

మా-కం॥ మీయాజ్ఞతోడ బోయిన। ప్రాయశ్చిత్తంబుమాకు బాగుగ
గలిగెన్। సేయునది లేకవస్తిమి। యీయిలపతి మనసుద్రిప్ప
యలవియె మాకున్॥

వ॥ అని వచించిన విశ్వామిత్రుండు రోషావేశుండై తన శిష్యుండగు నక్షత్రకునితో గూడ యామాతంగ కన్యలం దోడ్కొని హరిశ్చంద్రుని వద్దికేతెంచి యేమనుచున్నాడన.

వి-క॥ నినువరియింపగ వచ్చిన । వనజాయత లోచనలను వంచింపగ యో । యినకుల రత్నము జెల్లునె । ఘనముగ యిది గాంచువారు । కాదనరె భువిజ్ ॥

వాదం - దర్వు - ఆట.

వి॥ కోరివచ్చిన వారికై నిటు । కోపమొందగ జెల్లునే । ఘోర పాపం బిదియటంచును నేరవైతివి భూవరా ॥

హ॥ యోమహాత్మా యిటుల బల్కగ । యొప్పునామికీయెడజ్ నామదిజ్ కనుగొనగ యిట్టుల । నాడుచుంటిరొ దెల్యగజ్ ॥

వి॥ చక్కదనమున వీరికిని యిల । సాటిలేరిక భూవరా । మక్కువ గలిగీ వివాహా । మాడుమో సుగుణాకరా ॥

హ॥ కులము దక్కువ వారిబొందుట । గూడునే మౌనీశ్వరా । జలజమిత్రుని వంశులకు నిటు । జెల్లునే యోగీశ్వరా ॥

వి॥ వినుమి నావాక్యంబులను మది । వీడుమిక మూర్ఖంబునూ । ఘనతరంబగు మశురబాద । కాలకంఠుడు మెచ్చునూ ॥

వాదం - కందార్థములు - ఆట.

హ॥ అన్నియు దెలిసియు మీరలు । నన్నిటు నరకమునద్రోయ । న్యాయంబగునే । యెన్నియు యెటులైననునా । కన్నియలవరింప నేను॥ గాధితనూజా । మొృక్కెదమౌనీ । నాధారుక్ తేజా । మన్నించి యీమాట మళ్ళియెత్తకుడింక । సన్నుతించెద వేరె సద్విచారము దెల్పు ॥గా॥

వి॥ ఈ కాంతలతో గూడిన । భూకాంతస్వర్గమునకు । బొందితొ నిమ్నజ్ । ప్రాకటముగ నేదోలెద నీకనుమానంబదేల ॥॥ జనకునట్లూ । శాశ్వత సుఖము చేకూరునిట్లూ ॥ నాకభయమిమ్ము నిరాకరించకుమింక । యీకంజాతులనేలి యిహసుఖము గాంచుడి ॥నీ॥

హ-గీ॥ రాజ్యమంతయిట్టి రాజీవనయనుల ।కిత్తుగాని పెండ్లి కియ్యకొనను । వలదునన్ను యిట్లు బలవంతపెట్టుట । తగదు మునివరేణ్య దండమిదుగో ॥

వ॥ అనిన విశ్వామిత్రుండు మిగుల సంతోషించి,

వి-క॥ యిచ్చితివి రాజ్యదానము। బుచ్చుకొనుట మాకు జెల్లుపుణ్యచరిత్రా॥ మెచ్చితి నీధాతృత్వము । నచ్చెనునా మదికిచాల నటుసేయదగుజ్

వాదం - దర్వు - ఆది.

హా॥ రాజ రుషివర్య రాజకాంతుయుమీకు । తేజమొప్పగ గలిగి యుండుట తెలియదాయను నాకికా ॥రా॥

వి॥ కోరి నిన్నిందు జేరియడుగలేదు । ధారుణీశ్వర నీదునోట నె దానమిచ్చెద నంటివి ॥కో॥

హా॥ పన్నగనుమీరు మొన్న మొన్నటిదాక । కొన్నినాళ్ళు భూమినేలిన కొరత దీరక నుండెనా ॥ప॥

వి॥ చాలునధిక ప్రసంగము విడనాడు । మేలుగను వాగ్దాన మిడియిటు లేల బొంకులు బొంకెదా ॥చా॥

హా॥ ఆడి తప్పేటి వాడను నేగాను । కూడునే యిటు లనగ మీకును గొప్పవారలు మీరికా ॥ఆ॥

వి॥ అట్టులైన నీవసుమానమునులేక । మొట్టమొదలి రాజ్యమును మా పట్టుజేయుమి వేగమా ॥అ॥

హా॥ అరమరేలమీ యభిలాష నెరవేర్తు । ధరణీ మకురబాధ గారి । ధవుడుననుగని మెచ్చగా ॥అ॥

వ॥ అని యిటుల వచించి హరిశ్చంద్రుండు తన మనంబులో యేమని చింతించుచున్నాడన.

గీ॥ కాంతతోనేల వేటాడ గదలివస్తి । వచ్చియుండిన యామాల వనితలేల । నన్ను గోరిన వలదన్న నలగినారు । మౌని నిటుదోలి రిది యెల్ల మాయగాదె ॥

వ॥ ఇటుల చింతించుచున్న హరిశ్చంద్రునింగాంచి చంద్రమతి యేమనుచున్నదన .

చం-క॥ ధాత్రినిదానమొసగను। త్పాత్రుడు మనకబ్బెగాన పాయకవిశ్వా
మిత్రునకు దారవోసి బ । విత్రము జేకూర్చు మనపవిత్ర కుల
ముకున్ ॥

గీ॥ మానినీమణి నాయొక్క మానసముకు । దగిన పల్కులు బల్కి నాతాపమెల్ల । బాపియుంటివి నేనింక పలికిబొంకి । పాప మొడిగొన నాకేమి ఫలము చెపుమ ॥

వి-న॥ ఒరే హరిశ్చంద్రా యేమో ఆలోచించుకొనుచుంటివి రాజ్యము మాస్వాధీనము జేసెదవా లేక వూరక యిచ్చెదనని బొంకితివా.

వాదం - దర్వు - ఆట.

హ॥ పలికి బొంకెటి వాడగానూ ॥ మీరు అలుక జెందకుడింక వీనూ। వలనొప్ప యీరాజ్య వైభవ మెల్లను। సలలితముగమీకు సమర్పింతు నిదెగొనుడి ॥ప॥

వి॥ సరెమెచ్చినాడ భూపాలా। నీకు చిరకీర్తి గల్గుధీలోలా। స్థిరమొప్ప రాజముద్రికనిమ్ము నాచేత। నరనాథ ప్రజలెల్ల నామాట వినవలయు ॥

హ॥ యిదుగో ముద్రికమీరు గొనుడీ। మీ మదిలోన చింత వీడూడీ। సదయతతో ప్రజల సాకుచుండియు యే। కొదువలేకన యోధ్య కోర్కెతో నేలుడీ ॥

వి॥ అటులైన వినుడింకమీగూ। యి! చ్చటనుండ దగదు యిప్పుడు। కటకటపడక యెచ్చటికైన నేగుడి। పటుతరమౌ మకుర బాధ శంకరుమెచ్చ ॥

గీ॥ రాజ మీవొంటిపైనుండు రత్నభూష। ణాదులెల్లను దీసి సన్యాసులట్లు। నారవలువలు దాల్చి యీనాడెమీరు। వెడలిపొండిక నాయాజ్ఞ తడవులేక ॥

వ॥ అనిన వల్లెయని సమస్త భూషణాద్యలంకారంబులం దీసి విశ్వామిత్రుని కప్పగించి పురజనులనుంజూచి హరిశ్చంద్రుం డేమనుచున్నాడన.

హరి - దర్వు - ఆట.

పురజనులార నేపోయి వచ్చెదనూ। నిరతంబు నాపైని కరుణించుడికనూ ॥పు॥ అతులితగుణ పౌరోహిత మంత్రులారా। మీ। పతియైన మునియాజ్ఞ పాలింపుడికను ॥పు॥ ననుజూచినట్లు యీమునిని జూడుడిమీకు। అనుదినమును యితని యాజ్ఞమీరకుడీ ॥పు॥ పుడమీ మకుర బాధ పురమందు నెలకొన్న। పుడుపతి శేఖరుని యడుగూల గొలిచీ ॥

వ॥ అని యిటుల వచించి విశ్వామిత్రుని పాదంబులపై వ్రాలి యేమనుచున్నాడన.

హ_గీ॥ అతిథి యభ్యాగతులపూజ లన్నివిడిచి। రాజ్యమంతయు నీకును రాజితముగ। దారబోసితి నీయొక్క ధర్మప్రజల। ప్రభుడవై బిడ్డలట్లు కాపాడుమయ్యా ॥

వి-వ॥ ఒరే హరిశ్చంద్రా నాకు నీవా నీతులు బోధించుట చాలు నూరకుండుము యిక నారాజ్యమందొక క్షణమైన నీవు నిలచుటకు వీలు లేదు తొలగిపొమ్ము.

హ-వ॥ స్వామీ అటులే వెళ్ళుచున్నాడను.

చం-లో-వ॥ మునీశ్వరా నమస్కారములు.

వ॥ అని వెళ్ళుచుండగా.

వి-వ॥ హరిశ్చంద్రా నిలువుము మున్ను నాకు యజ్ఞార్థం బోసం గెదనన్న ధన మొసంగకనే బోయెదవా నొకవేళ నేను మరచియున్న నీవైన జ్ఞాపకము చేయరాదా.

విశ్వా - దరువు - ఆది.

మాధనమును మాకిచ్చెదవో। లేదనెవో। కాదనెవో। సాధుల తోడ నసత్యవాక్యములు। భూధవ బల్కుట బుధులిదిమెత్తురె ॥౧॥ పంకజ మిత్రుని వంశుడవూ। బొంకనేర్చితివి బహునీవూ। శంకలేక నేగుచుంటివేలను। బొంకితివనరా పొంకముతోడుత ॥౨॥ సత్యవాక్యమును నిల్పెదవా। యసత్యమునకు పాల్పడియెదవా। కాత్యాయని ప్రియకాంతుని సాక్షిగ। వ్యత్యాసము నీకడ నగుపడెనిక ॥౩॥

హ-గీ॥ సంయమీశ్వర సర్వరాజ్యంబుమీదు। వశము జేసితి నింక నావద్దనేమి। గలదు సతిసుతులతొ నేను కాలమెట్లొ। గడుప నెంచితి నాపైని కరుణదలపు ॥

వ॥ అనిన విశ్వామిత్రుండు మహాకోపోద్దీపితుండై,

శా॥ ఓరీ రాజకులాధమా మతియులే। దోనీకు కాసంతయున్
యేరా నీవిటులాడజెల్లునె భువిన్। యెంతేని నిన్ మెత్తురే
తేరా నాకిడియున్న ద్రవ్యము త్వరన్। దేకున్నచో నిత్తరిన్
మారుంబల్క నబద్ధమాడితివనన్। మన్నింతు నిన్నిప్పుడున్ ॥

హ-ఉ॥ భూసురవంద్య కోపమును। బూనుటదేలను మీధనంబునే
మాసములోన నిచ్చెదను। మానుగ నివ్వకనున్న వేళలన్
నాసతి సూనులన్ బరుల। కమ్మియునైన ఋణంబుదీర్తు యీ
దాసుడు యెన్నియెట్లయిన। దప్పడునాడిన మాటనీభువిన్ ॥

వి-వ॥ అటులైన మాద్రవ్య మిచ్చునంతవరకు యిదో నాశిష్యుం డగు యీ నక్షత్రకుని మీవెంబడి దోలించెద వీనికి మాత్రం యే యిబ్బంది గలుగకుండ నీవను గడువులో యెటులైనను ద్రవ్యమిచ్చి పంపుము అని నక్షత్రకుని చెవిలో.

వి-గీ॥ వినుమి నక్షత్ర నీవు యీవీరవరుని। యష్టకష్టంబులను బెట్టి నష్టపరచి। ద్రవ్యమిచ్చిన గొనితెమ్ము ద్రవ్యమివ్వ। కున్న లేదని బొంకించు మెన్నగాను॥

వ॥ అని యంపిన యా భూపాలుండు భార్యాపుత్రులతో నక్షత్ర కునితో యటనుండి బయలుదేరుటయు నంత.

నల్గురికి వాదం -'దర్వు - ఆది.

చం॥ నడువా నాచేతగాదూ। నాప్రాణేశ్వరవిను॥న॥ అడుగడుగుకు నొక యామడ దోచెనీ। యడవిలోన మనకొడుకునెత్తుకొని॥న॥

హ॥ కాంతానేనేమిసేతునే। వో ప్రాణసఖియా॥కాం॥ పంతముతోయా పద్మభవుడుమన। వంతున నిటువలె వ్రాసెనుగావున॥కాం॥

లో॥ అమ్మా యాకలి యగుచున్నదే। నాకన్నమునిడుమా॥య॥ కమ్మనికూరలుగల పరమాన్నము। తెమ్మానేనిక దినితృప్తిపడెద॥న॥

న॥ యెండ వేడిమికీ నేనికా। నోపంగజాలను॥యెం॥ దండిగ నాలుక తడబడు చుండెను। చండకిరణకుల జలమొసంగుమిక॥యెం॥

హ॥ జలజాక్షి యేమీసేతునే। యీకాంతారంబున॥జ॥ జలములజాడలు దెలిపియు మనలకు। యలసటదీర్చెటి యాత్ములెవ్వరూ॥జ॥

చం॥ ముందూ యీమునినందనునకూ। దాహంబుదీర్చుడీ॥ముం॥ నందనునకు హరినామామృతమే। యందంబుగ పానముజేయించెద॥ముం॥

న॥ కాలికిదెబ్బతగిలెనూ। నడువజాలనేనిక॥కా॥ చిలచిలరక్తము జిల్లుచుండెను। కలవిగాదు యీయాయాసంబును॥కా॥

హ॥ యెక్కు నాభుజముపైననూ। మునినందన నీవిక॥నె॥ మక్కువతోడుత మరియాదెంచియు। చక్కగజూతును సంశయపడకుము॥

లో॥ దిగులుగల్గెను నాకికా। యీ మృగముల జూచియు॥ది॥ పగలేచీకటిపడజొచ్చెనునే। నిగతాళను నాయిననన్నెత్తుకొ॥ది॥

చం॥ ధరణీ ప్రసిద్ధికెక్కినా ! మథురాబాద ॥ధ॥ పురమున వెల సిన పురహరమూపై । కరుణించుము యీకష్టము నోర్వము ॥ధ॥

వ॥ అని యిటుల మార్గాయాస బడలికచే వారొక చెట్టునీడం జేరి శయనించుటయు నంతలో.

—( భేతాళుడు ప్రవేశము - దర్వు - ఆది)—

భూత జాలంబూకు నేతనైనమహా । భేతాళ నాముడ వినరా । ప్రఖ్యాతి జెందినవాడ గానరా ॥ భూతాలవాసుల ప్రీతితొ బట్టియు భూత నొందించేటి వాడరా । మహా । క్షితిని గొల్పేటివాడరా ॥౨॥ శూలా యుధంబూను కేలనొప్పుచునున్న । నీలశరీరుడ వినరా । కాలూడైన నన్ను గాంచి తత్తరమొందు । కాళీభక్తుండాను ఘనబాహు బలుడాను ॥ భూ॥ ధరణీ మథురబాద ధాముడైన పురహరుని నామదిలోనదలచెదరా। చరణ ఘట్టనచేత ధరణి వణంకగ యరుదెంచితిని వీరవరుడానురా ॥భూ॥

ద్వా-క॥ అబ్బబ్బా నినుగనుగొన । తబ్బిబ్బై నాదుమదియు । తల్లడమొందెఁ । నిబ్బరమౌనీ చరితము । దబ్బున వినుపింపుమయ్యా । దండము జేతున్ ॥

భేతా-వ॥ ఒరేఒరే బుద్ధిబలంబున భుజవిక్రమంబున భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ వ్రాతంబునకు నేతనైన భేతాళుండను నా నివాసం బగు యీ వనవృక్షచ్ఛాయను యెవండో రాజాధముండు వచ్చి చేరుటం గాంచి వానిం వధించి మెక్కునట్టి వాంఛతో నరుదెంచితి దూతా వినయ విఖ్యాతా.

హరి - భేతా - వాదం

భే॥ ఒరేఒరే నీవెవండవురా । యీ । తరుచ్ఛాయనిటు చరించెవూ నరాధమా నిఁ ధరన్‌గూల్చినీ । శరీరమును దిందురా నిల్వునిలు ॥ఒ॥

హ॥ నీవెక్కడ నేనెక్కడరా । నీ । లావుంగని నే క్షితిలరా । కావరమున నిటు కారులు బల్కెవు । సావధాన మతివై మాట్లాడుము॥

భే॥ భేతాళుని ముందరనీవూ । మది । క్షితింతయు లేకనులావూ । పోతరించి పలుకూతలు గూసెవు । పాతక నిన్నిదె పట్టివధించెద ॥భే॥

హ॥ దురాంధకారుడవై యిటులా । యరి । మురిజేయు చుంటి వదేలా । తరుల్ గిరుల్ తత్తరిల్లగను నీ।శిరంబుద్రుంచెద శరంబుదాల్చితి ॥

భే॥ యేలనుమాటలు చాలునురా । నిన్ । దూలించెద చూడుమి యిదెరా । శూలాయుధమును కేలంబూనితి । సోలిపోకనిలు శూరుడ వైతెను ॥యే॥

హ॥ సురగరుడోరగ కిన్నెరులూ । యిందరుదెంచిన నీతోడు గనూ ధరమశురాపురి ధాముడుమెచ్చగ । శరఘాతంబున ధరన్గూర్తు విను ॥సుర॥

వ॥ అని యిటుల హరిశ్చంద్రుండు ప్రయోగించిన బాణ పరంపరలకు తాళజాలక భేతాళుండు పారిపోవుటయు నంత సూర్యోదయ మైన పిమ్మట.

హ-వ॥ భామామణీ తెల్లవారవచ్చెను లెమ్ము వారణాసికి బోవుదము.

చం॥ ప్రాణేశ్వరా అటులేపోవుదము పదుడు అని పోవుచుండ వర్షము గురియుచుండును.

చం-క॥ ధారాపాతంబై యిటు । ఘోరంబుగ వర్షమిపుడు । గురియుచునుండెన్ । యేరీతి నడువనేర్తును । ఘోరాటవిలోనముద్దు కొడుకుతో నేనున్ ॥

హ-వ॥ తరుణీమణీ యీ యకాల వర్షంబెల్ల యీ కాలకౌశికుని మాయనేగాని వేరొండుగాదు యేమిసేయుదము ఘనికుమారా మాతో గూడ నీవిక్కట్టుల జెందవలసివచ్చె రమ్ము.

నక్ష-వ॥ రాజా కాశీనగర మింకెంతదూరముండెను.

హ-వ॥ యీఅరణ్యముదాటిన నగుపడును. పదండి అని యిటుల కొంత దవ్వేగుసరికి వారికి నలుదిక్కుల నగ్ని ముట్టడించుట అది జూచి చంద్రమతి దిగులొంది.

చంద్ర - దర్వు - ఆది.

దిగులు దోచెనుప్రాణనాథా । అడవి । రగులుకొనియెను చూడరాదా । నగవాసునీచిత్రి మిగదోచదాయెను । జగతిలో యేరికి పగదల్పమైతిమి ॥ది॥ పడలేను యీకష్టములనూ । అగ్నిం । బడి ప్రాణముల విడచెదాను । కొడుకునింకనుమౌని కొడుకూను రక్షించు । పుడమీశ్వరా నేను బోదు సెలవివ్వాడి ॥ది॥ ముని విశ్వామిత్రునిమాయా । నా ।

మనసుకేమియు దోచదాయా । వనజమిత్రుని వంశవార్ధిచంద్రుడ సత్య। మును వీడకుడి మధురాపురి పురహారుసాక్షి ॥ది॥

హా-గీ కమలలోచన నిన్విడచి ఘడియయైన । తాళజాలను నా యొక్క తనువువహ్ని । కర్పణము జేతు యాచిన్ని కందునీవు । పోష ణము జేయు మెప్పుడు బుద్ధితోడ ॥

వాదం - దర్వు - ఆట,

లో॥ అమ్మరో వినవే మాయయ్యను విడనాడి । యియ్యేడ యెటుబోయెదావే । తెల్పుగదవే ॥

చం॥ ననుగన్నతండ్రీ యేమనినీతో వచియింతు । వనజ సంభవు డిట్లు జేసే । నొదుటవ్రాసే ॥

లో॥ నన్నుగన్నతల్లి యెక్కడికేగుచుండెను । వినజేయునాతోను జనకా । ప్రేమవిడకా ॥

హా॥ యెటుబోదు మీతల్లి । యేలచింతించేవు । యిటురార నాముద్దుబాలా । సుగుణాలోలా ॥

న॥ మీరు యగ్నినిజొచ్చి మృతిబొందియుండిన । యేరీతి ధన మిచ్చేదారూ । దెల్పలేరూ ॥

లో॥ పాపగ్రహామువోలె । బాధించుచుండెయా । బాపడు మన లనో తల్లి । కల్పవల్లి ॥

చం॥ వద్దు అట్లనబోకు బుద్ధిగాదురనీకు । ముద్దులతనయ నీనోటా। వలదీపూటా ॥

లో॥ అయ్యయ్యో యీబాపనయ్యాయు మనవెంట। దయ్యాము వలె దవిలీనాడూ । విడువలేడూ ॥

న॥ చూడ జేనెడులేదు వాడియౌ మాటలు । వీడెట్లు బలుకు చున్నాడు । రాజచూడు ॥

హా॥ పసిబాలుడాడిన పలుకూలు పాటింప । రసికుడ విది నీకు తగునా । ధర్మమగునా ॥

చం॥ ధరణీ మథురబాద ధాముడైనపుర । హారునీ చిత్రముదోచ దాయా । తెలియదాయా ॥

గీ॥ సత్యశీలుండు నాయొక్క స్వామి యైన। యేనుపతివ్రితనైనచో నీతుణంబె। ఘోర దావానలంబు జల్లారుగాక। యిందు మాలోప మున్న దహించుగాక ॥

వ॥ అని చంద్రమతి యిట్లని నుడివినంత మాత్రంబున యగ్ని చల్లారిపోవుటయు నదిగాంచి హరిశ్చంద్రుండు సంతోషించి తన మనంబున యాకాశీ విశ్వనాథునిం గూర్చి యేమని స్తోత్రము జేయుచున్నాడన.

హరి - దర్వు - ఆట.

శ్రీవిశ్వనాథా । మమ్ములబ్రోవు మోవిశ్వనాథా । దేవాది దేవాయో దీన జనోద్దార । భావాజసంహార పాపవిమోచన ॥శ్రీ॥ నినునమ్మితీనీ । నామనమూన నీవేదిక్కనీ । యినచంద్రానలనేత్ర । యిభచర్మాంబరధార । కానకాద్రి కార్ముక । గౌరిమనోహర ॥శ్రీ॥ నందివాహన । సుందరరూప నాగేంద్రాభరణా । బృందారకావంద్య బుధజన పరిపాల । మందరాద్రిధీర మకురబాద విహార ॥శ్రీ॥

న-వ॥ హరిశ్చంద్రా నన్నింకా యెంతదూర మీయడవులంబడి నీడ్చుక బోయెదవు మాధనం బివ్వకున్న లేదనరాదా నేబోయెదను.

చం-వ॥ మునికుమారా కరుణింపుము గడువులోగానే జెల్లింతుము.

న-వ॥ అటుగాదమ్మా నీవు వినేటట్లుగా వుంటే వొకమాట దెల్పెదను.

చం-వ॥ అదేమిటి నాయనా.

నత - కందార్థము.

వనజాతీ నాదుమాటలు । వినుమ్మృషగా దలపవలదు । వేగమెనా వెం । ట నయోధ్యా పురమునకుం। జనుదెంచిన మౌనిపాద॥ జలజంబులకునూ । మొ్రక్కియు నేను సన్నుతించియునూ । వినవమ్మ నీముద్దు తనయూనకును పట్టం । బునుగట్ట జేతు యడవిని దిరుగలేవింక ॥జ॥

చం-చం॥ హరిహరి యెంతమాటయిటు ।లాడగ జెల్లునె బ్రహ్మచారినీ
వెరుగని ధర్మముంగలదె । యెందుననైనను జూచియుంటివే
పరమ పతివ్రతల్ విభుని । బాసియు నొంటిగ నుండనేర్తురే
సరెసరె నీదుమాటలిక । చాలునుచాలును యూరకుండుమా ॥

న-వ॥ అమ్మా క్షమించుము. మా అప్పుదీ రేదెట్లో దెల్పుము.

చం-వ॥ ఏలయిట్లు తీవరింప జొచ్చితివి నీ గడువులోనే ముట్టి జేతుము.

న-వ॥ ఒరే హరిశ్చంద్రా నిలునిలువుము.

గీ॥ ఇవ్వజాలిన ద్రవ్యంబు నిచ్చివేయు । లేనిచో యిప్పుడేనాతో లేదటనుము । రెండుమాటలనేదైన ఖండితముగ । బలుకు మింటికి నేగెద బలుముదమున ॥

న-వ॥ ఈరెంటిలో నేదైనా జెప్పకుంటివేని యీశిలాపాతంబున శిరస్సు పగలగొట్టుకొని రక్తము నీపై జల్లెద వింటివా అని రెట్ట బట్టీడ్చును.

హరి - నక్ష - వాదం - ఆట

హ॥ నట్టడవిలోనన్ను రెట్టబట్టీడ్చిన బ్రహ్మాచారీ । ద్రవ్య । మెట్లు లొచ్చును నన్ను హింసింపదగదయా బ్రహ్మాచారీ ॥

న॥ తగదంచు నాతోడ వగలు బల్కెదవేర నీవూ । నాతో లావు । యివ్వగజాలననిపల్కు యిప్పుడే నేబోదు నీవూ । నాతో లావు॥

హ॥ నిష్ఠూరవాక్యంబు లేలనాడెదరయ్యా బ్రహ్మాచారీ । నన్ను । కష్టపెట్టకుడీ మీగడువు మించగలేదు బ్రహ్మాచారీ ॥

న॥ రేపుమాపనుచూ నీరీతి బొంకెదవేల నీవూ । నాతోలావు నీ యాపద కోర్వను యనృతంబులాడేవూ నీవూ । నాతో లావు ॥

హ॥ ఆడితప్పుటకూ నే నవివేకుడనుగాను బ్రహ్మాచారీ । శివుని తోడు నీద్రవ్యంబు మూడునాళ్ళలోనిత్తు బ్రహ్మాచారీ ॥

న॥ నేనేమొండియటన్న నాకంటె మొండివి నీవూ । నాతో లావు । పట్టు । బూని యుండియున్నను బోనివ్వకుంటివినీవూ । నాతో లావు ॥

హ॥ భాసురమౌ మణురబాదలో నెలకొన్న బ్రహ్మాచారీ । చిద్వి లాసుని సాక్షి నేమోస గాడనుగాను । బ్రహ్మాచారీ ॥

వ॥ అనియిటుల నాహరిశ్చంద్రాదులు కాశీపురంబు జేరబోవు టయు నంత.

చం-గీ॥ ప్రాణనాయక యీపాప భంగమైన । గంగలోస్నాన మొనరించి కడురయమున । విశ్వనాధుని పాదారవిందములను । పూజ గావించి యెందైన బోవలయును ॥

న-గీ॥ పూజగీజలంచు పెద్దిద్దులు బుచ్చక । మాదురుణముదీర్చు మాటదలచి । ధనము పోగుజేయు దారిని యోచించి । సాగనంపు డింక సత్వరమున ॥

హరి - చంద్ర - నక్ష-లోహి - వాదం - దర్వు - జుల్వ.

హరి॥ ఏమిసేతునూ । ద్రవ్య మెట్లు దెత్తునూ । నామదికిని దోచదాయె । నారీమణివినూ ॥ఏ॥

చం॥ చింతసేయకూ । ప్రాణ । కాంతగుందకూ । మనవంతున యాబ్రహ్మయిటుల వ్రాసినందుకూ ॥

న॥ యెన్నడిత్తురూ । యిటు । లేల బొంకేరూ । మన్ననగల వారివలెను మాటలాడేరు ॥

లో॥ యెందుకిట్టులా । మ । మ్మిందునుచాలా । తొందరపెట్టె దవు భూసురేంద్ర సుశీలా ॥

న॥ వుండనోపనూ । యిచట । ఖండితముగనూ । దండిగ నన్నం పుడి మాద్రవ్యమిచ్చియునూ ॥

హరి॥ ధరణీ మశూరా । బాద । ధామపుగహరా । నను । కరు ణించియు రుణవిముక్తి తెరువు జూపరా ॥ధ॥

న-గీ॥ ధనము నీవద్ద నెంతమాత్రంబులేదు । త్వరగ నార్జించి నొసగెడు తెరువులేదు । కోరినీకప్పు నమ్మెడివారులేరు । గాన నీభార్య నమ్మైన గట్టురుణము ॥

వ॥ హరిశ్చంద్రా నీవు సత్యవంతుడవైతె నీభార్యను విక్రయించి మాయప్పుముట్టజేయుము లేనియెడల యివ్వలేననుము పూరకనన్నేల మీవెంట తిప్పల బెట్టుచు ద్రిప్పుచుండెదవు.

నక్ష - దర్వు - ఆట.

అమ్మరా యాలీ నమ్మరా । హరిశ్చంద్ర నీవిక ॥న॥ అమ్మ కుండిన యెడలమాదు రుణమ్ము నెటువలె దీర్చువాడవు । నమ్మజాలరు

నీకు కాశి పురమ్ములోపల నిప్పుడెవ్వరు ॥అ॥ చాలుచాలిక రేపుమాపని యేల బొంకులు బొంకుచుంటివి । కాలమిటువలె వ్యర్థపుచ్చకు । తాల నొక ఘడియైన నేనిక ॥అ॥ పరమ దారిద్రుడవు నీతో । దిరిగిదిరిగియు వేసటొందితి । జరుగనివ్వను నిన్ను నేనిక । త్వరగ మారుణమివ్వ కుండిన ॥అ॥ పలికిబొంకని తనము ఖీవిటు । బట్టుబట్టిన యెడల వేగమె । యిలలో వెలసిన మఠురబాద । జలజబాణుని వైరిమెచ్చగ ॥అ॥

వ-ఉ॥ ఓకమలాప్త వంశవిను । యూరక కాలము జర్పుచుండ నీ
కేకరణిన్ లభించుధన । మెట్టుల మాదు రుణంబు తీర్చగన్
రూకలొసంగలేనియెడ । రూఢిగ బొంకుము బొంకకున్న నీ
పోకలుమాని యాలినిగ । పోకడబెట్టుము పోయినంతకున్ ॥

వాదం - దరువు - రూపకం

హరి॥ కలికీవింటివెయీాతని । పలుకులువిన నాచెవులకు । ములు కులవలె నాటెనువో । జలజాయతనేత్రీ ॥

చం॥ సమ్మతితో నన్నారులకు । నమ్మియునైనను యీామునీ । సొమ్మును జెల్లించుడి స । త్యమ్మును విడకుండా ॥

హరి॥ అకటకటా యిదియెంతటి । యాపదమన కొనగూడెను సకలోర్వీశుడనైనా సతినెటు లమ్ముదునూ ॥

చం॥ తడవేలను మునికొసగిన । గడువును మీరకముందే । పుడమీశ్వర నన్నమ్మియు బొందుడి సత్కీర్తి ॥

హరి॥ కులసతి నమ్మినవారలు । గలరా యెందైనను భువి । నలుగురు ననుగని కిలకిల నవ్వెదరో యబలా ॥

చం॥ పలికియు బొంకినవారల । భారము మోయనటంచును । పలుకదె భూదేవియుమును । బ్రహ్మదేవునితో ॥

హరి॥ నినుబాసియు నొకఘడియ । నిలువగనోపను చెలినా । మనమున కెటుదోచదు । యేమనజాలను భామా ॥

చం॥ కొంకక మదిలోపల నిను । బొంకింపగ మునివర్యుడు । కంకణమును గట్టుకొనెను । యింకను తడవేలా ॥

హరి॥ శివశివ యెటుజేయుదునా । చిత్తము చంచలమొందెను । సువినీ మఠురబాద । పురవాసుడ బ్రోవూ ॥

వ॥ అని యిటుల పశ్చాత్తాపము జెందుచున్న హరిశ్చంద్రునిం గాంచి.

స-గీ॥ మీరుమీలోన నేమేమొ మిగులదుఃఖ • పడుచునుంటిరి మాయొక్క పైకమివ్వ • కున్నచో యివ్వలేనన గూడదటర • యిచ్చి నను యివ్వకున్న నేనేగువాడ ॥

వ॥ నక్షత్రకుండటుల తీవరింప జొచ్చినంజూచి చంద్రమతి హే నాథా చింతింపవలదు "అవశ్య కర్మమను భోక్తవ్య" మను నార్యోక్తిగా మనమేమి చేయగలము. పదుడు నన్నమ్మి ఋణముక్తుండవై సత్యము నిలుపుకొమ్ము.

హరి - దర్వు - ఆట.

ఈమానినీ నమ్మెదానూ • గొనుడీ ధీమంతు లెవరైనమీరూ • భూమి దేవతలైన • భుజజనితులైనను ॥ శ్రీమంతులౌ వైశ్య శ్రేష్ఠులెవరైనను ॥ఈ॥ హాటకాంగిది ముద్దుగుమ్మా • దీని • సాటియెందునలేదు సుమ్మా • మేలైన గుణమూల పేటి నావధూటి • పాటలాధరి వలయు పైకమిచ్చిననిత్తు ॥ఈ॥ పరమసాధ్వియు దీనితోనూ • దాసి పనులెల్ల జేయించుకొనుడూ • ధరణీ మణురబాద ధాముడై విలశిల్లు • పరమేశ్వరునిసాటి ప్రజలెల్ల వినుడింక ॥

వ॥ అని యిటుల నరచుచు కాశీపుర వీధుల్లో దిరుగుచుండు నంతలో.

—(కాలకౌశికుడను బ్రాహ్మణుడు రాకడ - దర్వు)—

కాలకౌశిక నామధేయుడా • ధీ • లోలూడ బహుపుణ్యశీలుడా• నాలుగు వేదంబు లారుశాస్త్రంబులు • మేలూగ జదివితి మేదినిలోపల ॥ కా॥ పౌరోహితముచే జీవించెదా • మహా • ధైర్యముతోనే చరించెదా• సారెసారెకుజ్యోతిశ్శాస్త్రంబు ప్రజలకు • కోరికతో దెల్పి కోట్లుగడించితి॥ కా॥ కలహకంఠియు నాదుభార్యరా • ముద్దు • లొలుకుచుండెటి పువ్వుబోణిరా • యిలలో మణురబాద నిలయుడైన నీల • గళునీపాదంబూల• కరమొప్ప పూజింతు ॥కా॥

వ॥ అని ఇటులరుదెంచి హరిశ్చంద్రుని జూచి యేమనుచున్నాడన.

కా-గీ॥ ఎవ్వడవు నీవు నీదేశ మెయ్యదో కా। గుణము జెడినీవు నీయొక్క కులసతినిటు। విక్రయించెద విదియేమి వెర్రితనమొ। తెలియ జెప్పుము నా వీను లలరగాను॥

హ-ఉ॥ ఈసతి నాదు భార్య జల। జేక్షణ సద్గుణ పుణ్యశీలనే
కోసలదేశవాసుడను। కూర్మి దివాకరు వంశజుండనే
కౌశికు నప్పుదీర్చుటకు। కాంతను నమ్మగ బూనినాడనో
భూసురవర్య నీకుగొన। బుద్ధిజనించిన సంతసించెదన్॥
కా-వ॥ సరేకాని దీనిపేరేమి.
హ-వ॥ చంద్రమతి, నాపేరు హరిశ్చంద్రుడు.

వాదం - దర్వు - ఆట.

కా॥ ఎన్నిరూకల కిచ్చెదావూ। వున్నదున్నంత దెలుపూమి నీవూ। పన్నుగ మాయింట పనులుజేయుటకయ్యా। కన్నన నేనిట్టి కాంతను గైకొందు॥

హ॥ కరిపైన నిలచి మనుజుడునూ। నిజ। కరమూచె మాణిక్య మూనూ। కర మెప్పపైకి నెగురజిమ్మగానెంత। వరకేగునోయంత వరహాల కుప్పాను॥

కా॥ అంతద్రవ్యము నివ్వలేనూ। యింక। కొంతతగ్గించూడి యికనూ। వింతగదోచె మీవిధమూనుజూడ శ్రీ। మంతూడనేగాను మహిసురుడనుసుమ్మి॥

న॥ యెక్కువేమియు జెప్పలేదూ। పైస। తక్కువన్నను బనికిరాదు। వొక్కటేమాట మీకొప్పిన గైకొని। రొక్కమంతయు దెచ్చి యిక్కడ బోయుమీ॥

కా॥ చెప్పినపనులెల్ల జేసీ। మా। మెప్పుగైకొనునా యీదాసీ। తప్పుదు నడుకలు తగవునాయింటిలో। వొప్పుగ నాపుత్రి వోలె నేచూచెద॥

హ॥ పరమ పతివ్రతసుమ్మి। నీ। వరమర జూడక గొనుమీ కర మెప్ప దవ్య మిక్కడదెచ్చి నొసగూమి। ధరణీ మశురబాద ధాముడు మెచ్చగ॥

మాటలు

కా॥ రాజా నీవు జెప్పినధర చాలా యెక్కువగానున్నది యేమైన తక్కువ జేయుము.

హా॥ అయ్యా నేనబద్ధమాడువాడను గాను సత్యముకొరకై యాలునమ్ముచుంటిని ఒకటేమాట నీయిష్టమైనచో గొనుము లేనిచో యూరకుండుము.

కా॥ సరే అటులేయిచ్చెద గైకొనవయా.

న॥ తెమ్ము యిక్కడికి కొంతద్రవ్యము నాకుముట్టెను.

కా॥ చంద్రమతీ రమ్మి. అన చంద్రమతి యా కాలకౌశికునితో బోవుచుండ లోహితాస్యుడు వెంటదవిలి మిగుల దుఃఖముతో.

లో - దర్వు - ఆట.

అమ్మాయెక్కడకేగెవే । నన్విడచీ మా ॥యమ్మా॥ రమ్మాని నన్నెత్తుకొమ్మా నఽబిలచూక । పొమ్మా వొంటిగనుండ సుమ్మా నామనవీను ॥అమ్మా॥ మాయయ్య నెడబాయ న్యాయమా నీకిది । ఓయమ్మ నినుబాసి వోర్చెద నెట్టుల ॥అ॥ ధఽణీ మళరబాద పురమూలో నెలకొన్న । హరుకైన మనపైని కరుణరాదాయె ॥మా॥

వ॥ అమ్మా నీవెంట నేనుగూడ వచ్చెదను తోడుకొని పొమ్మి.

హా-వ॥ భూసురోత్తమా వొకమనవి.

హా-గీ॥ ఆర్యనామాట వినుమింక నావుగొనియు। దూడ విడచుట భువిలోన దోషమంద్రు । గాన వీనికిగా కోటి కనకమిచ్చి । గొనుము నాపుత్రునిచ్చెద కోర్కెతోడ ॥

కా-వ॥ ఒరే హరిశ్చంద్రా నీవంటి టక్కరి కొక్కెర నెందు జూడలేదు. ఆవుకు వేరే దూడకు వేరే వెల యెందైనగలదా, చాలు నూరకుండుము. నీవంటి ధర్మహీను నెందుజూడలేదు.

హా-వ॥ భూసురోత్తమా నేచెప్పిన ప్రకారం బిచ్చి కొనుము. లేదేని తొలగిపొమ్మి

న-వ॥ హరిశ్చంద్రా పోనిమ్ము లేనియెడల తల్లి పిల్లను యెడ బాపిన దోషము నీకు గల్గును.

హరి - చంద్ర - వాదం - దర్వు - ఆది.

చం॥ నాథా నిన్నెడబాసి నరుగూడు నెటులా । యేదారి దోచదు యేమిసేయుదుహా ॥నా॥

హ॥ నీరజనేత్రి నేనేమి సేయుదునూ । ప్రారబ్ధ కర్మను బడ ద్రోయలేనూ ॥నీ॥

చం॥ నినుబాసి ప్రాణముల్ । నిలుపూడు నెటులా । మనజాల నేనింక మహాసత్యశీలా ॥

హ॥ యేనాడు యిటులౌట । నెరుగనోచానా । దీనుడనై తియే దిక్కుదోచదుగా ॥

చం॥ మరల మీపదసేవా దొరుకూనాకెటులా । భరియింప జాలనీ పరితాపమిటులా ॥

హ॥ యిలలో మశురజాద।యీశూని కరుణా।గలిగినప్పుడు మరల గలియుదుముచానా ॥

కా-ప॥ చంద్రమతీ పదపద ప్రొద్దుపోయెను.

చం॥ నాథా సెలవా. (హరిశ్చంద్రుదు దూరకుండును)

లో॥ నాయనా మా అమ్మవెంట బోవువాడను అని వెడలి పోవుదురు. యాతదుపరి.

-- ( కలహకంఠి వేషము రాకడ - దర్వు - ఆట. )

కలహకంఠియాని యందురూ । నన్ను । పలువిధముల బొగడు చుందురూ । తెలివిచేతను యెన్నో తీరుల ద్రవ్యంబు । వలనొప్ప గడి యించి వన్నె కెక్కినదాన ॥క॥ భూసుర కులమందు బుట్టితీ । కాసు । వీసము జతగూర్చి పెట్టితీ । నాసరివారలు ననుజూచి భళియన । వాసి వన్నెలుగల్గి పర్దిల్లు చుండెద ॥క॥ కాలకౌశికుడూ నాభర్తయూ । గుణ । జాలుడు దుర్గుణ హర్తయూ । మేలు మశురబాద ప్రోలులో వెలసిన నీలకంఠునిపాద నీరేజములగొల్తు ॥క॥

వ॥ అని తన భర్తజాడ లగయుచు.

దర్వు.

ఎందుబోయెనో । నామగడుతా । నెందుబోయెనో । యెందు బోయెనో యింటి కిదివరకు రాడాయె । సందు గొందు లన్ని జాడలర

యుచువస్తి ॥యెం॥ పొద్దుపొడుపునలేచి । పొట్టనిండగలేని । చద్ది యన్నముదిని చద్దువద్దనియంటె ॥యెం॥ పంచాంగమును చిన్న పంచె చంకనుబెట్టి । యెంచగ మధురబాదీశుని దలచూచు ॥యెం॥

వ॥ అంతలో కాలకౌశికు డరుదెంచినంజూచి.

వాదం - ఏలలు.

కల॥ ఎందుబోయినావు నీవు । యింటిమీది ధ్యాసలేక । సందె వేళగావచ్చెనయ్యా ॥ఓఓ నా మొగడాయీ । సుందరాంగి యెవరో దెల్పుమా ॥

కాల॥ వొంటిదాన వగుటచే మన । యింటగల్ల పనులుజేయ । గొంటిదీని వినవేవో భామా । ఓ కలహకంఠీ మన । యింటనేయుండూను వోలేమా ॥

కల॥ ద్రవ్యమంత పాడుజేసి । దయ్యమోలె దీన్నిదెస్తివి । వ్రయ్యలు జేసెద నీశిరసూ । ఓ ఓ నా మొగడా । చెయ్యలేను కాపురమునేనూ ॥

కాల॥ వలదే వలదే వలదేసి కీ । కలహమూ నాతోడ నిట్లు । సలలితాంగిని నీవే జూచుకో । ఓ కలహకంఠీ । జలజబాణుని వైరి మెచ్చగా ॥

వాదం - దర్వు.

కల॥ ఔరానీవునన్నడుగకుండగ ద్రవ్య । మేరీతి గొనిపోతివి । దెల్పరానీ ॥వే॥

కాల॥ పిన్ననాటనుండి పీనుగులను మోసి । యిన్నిరూకలు గూర్చితీ । నేనేభామ ॥యి॥

కల॥ కట్టెలమ్మినేను గడియించలేదటర । వట్టికూతలుగూయకూ। కొట్టెదచూడు ॥వ॥

కాల॥ దివసాలుజేసి తద్దినమూలు బెట్టించి । తిరుపమెత్తియు గూర్చితీ । యీద్రవ్యము ॥తి॥

కల॥ జుట్టుబట్టియుయీడ్చి యట్టెకొట్టెదచూడు । వట్టిమాటలు బల్కకూ । మాటికి నిట్లు ॥వ॥

కాల॥ పతినిట్లు బలికిన తీతిని మశురబాద । శితికంఠుడును మెచ్చడే । ఓ పణతీనిఁ ॥శి॥

వ॥ వారిట్లు కలహించుచుండగా చంద్రమతి జూచి యేమను చున్నదన,

చం-గీ॥ పతిని దిట్టుట కొట్టుట పతివ్రతలకు । ధర్మమాయిట్లు సేయుట తగదునీకు । పతిని సేవించువారికి పరము గల్గు । ననుచు వచియింపరే మున్ను నార్యులెల్ల ॥

కల-వ॥ ఒసే దాసిముండా మా యిరువురికి తగవు జెప్పుటకై నిన్ను దీసుకరాలేదు యిదో వినుము.

సీ॥ తొలిజామునను లేచి యిల్లెల్ల నూడ్చియు । సరగున కల యంపి జల్లవలయు । అటుపైని వంటపాత్రలు శుభ్రపరచియు । చెట్ల కెల్లనుపాదు జేయవలయు । వడ్లు దంచియు బియ్యము మొనరంగ జేసియు గట్టినూకలుపిండి గొట్టవలయు । మురికిగుడ్డలుగట్టి మోపుగై కొనిపోయి। తెల్లగా నుతుకుక తేవలయును । అట్లు గాకున్న నీవీపు చిట్లగొట్టి । కూడు బెట్టక నీపొట్ట మాడబెట్టి । ప్రాణములు దీయుదాన నా భావ మింక । కొన్ని నాళ్ళకు దెలియునో వన్నెలాడి ॥

క॥ ఈపోరడు ప్రతినిత్యము । బాపని కుర్రలతో యడవి బాగుగదిరిగీ
శ్రీపతి పూజకు పువ్వులు । వోపికతో దేకయున్న యోర్వనుసుమ్మా॥

వ॥ ఇక్కడ వీరికథ యీలాగునుండ అక్కడ నక్షత్రకుండు హరిశ్చంద్రుని జూచి యేమనుచున్నాడన.

న-క॥ జనపాలక నీవిచ్చిన । ధనమిది నాభత్యమునకు దగ జెల్లువడెఁ
వినుసత్యముదప్పక మా।మునిరుణమునుదీర్చువడ్డి మొదలుసహితమున్॥

వాదం – దర్వు – ఆట.

హ॥ ఇదియేమియన్యాయ మిటులబల్కెదవయ్యా బ్రహ్మచారీ । నా । ముదితనమ్మియుబాకి ముట్టజేసితిమీకు బ్రహ్మచారీ ॥

న॥ వినవయ్య నీవిచ్చు ధనము యీనాటికి రాజవర్యా । నా । దినభత్యమునకయ్యె దీరిపోయెనుసుమ్మి రాజవర్యా ॥

హ॥ భత్యమిమ్మని మౌని పలికి యుండగలేదు బ్రహ్మచారీ । అసత్యవాక్యములాడ జనదు నాతోడను బ్రహ్మచారీ ॥

వ॥ యీతీరు నీవెంట నిన్నాళ్ళు దిరుగాగ రాజవర్యా । నీ తాతనౌకరిగాను తండ్రినౌకరిగాను రాజవర్యా ॥

హ॥ కోపపడియునన్ను గొట్టవచ్చెదవేల బ్రహ్మచారీ । కొంచ మోపిక వహియించు నాపాలి దైవమా బ్రహ్మచారీ ॥

వ॥ యెన్నాళ్ళు నీతోడ నిటువాలె దిరుగూదు రాజవర్యా । నీ వన్నగడువుదాటె నన్నవినవునీవు రాజవర్యా ॥

హ॥ నాతనువు దెగనమ్మి నయమొప్ప దీర్చుకో బ్రహ్మచారీ । సం । ప్రీతి మళురబాద భూతేశ్వరుని సాక్షి బ్రహ్మచారీ॥

వ॥ అటులైన పదుమని నక్షత్రకుండు హరిశ్చంద్రుని దండకు త్రాడుగట్టి కాశీపుర వీధులలో యేమని విక్రయించుచున్నాడన.

నక్ష - దర్వు - ఆట.

వినుడీ । మీరుగొనుడీ కాశీపుర వాసులారా యీ ! జనపాలు నమ్మెద ॥వి॥ ఘనతర భుజశాలి కాకుత్సకులజుండు । మనసిజ రూపుడు మహాసత్యశీలుడు ॥వి॥ కడుపుణ్యవంతుడు కడలి గంభీరుడు । అడిగీన ధన మిచ్చి యవనిలో నెవరైన ॥వి॥ పరవోప కారమై పాటుబడుచునుండె । ధరణీ మళురబాద ధాముడు మెచ్చగ ॥వి॥

వ॥ ఓఓ జనులారా యీ భూపాలుని కోటి ధనంబునకు విక్రయించుచున్నాను. చాతుర్వర్ణముల వారలలో నెవరైనా సరే కొనుండోహోయ్.

వీరబాహుడు రాకడ దర్వు - ఆది.

దూరముండూడయ్య దొరలూ పెద్దింటోన్ని ॥దూ॥ యీరబాహుడాను పేరుగల్లవాన్ని ॥దూ॥ కాటికాపరినయ్య మేటిసూరుడనయ్య । కాటుకవంటిదేహ కళగుల్కువాడనయ్య ॥దూ॥ చెప్పరాదునోట తప్పతాగీవస్తి! ముప్పు తిప్పలులేక నెప్పూడు నుండేద ॥దూ॥ శవమూకొక్కరూక । జేకొన్న ధనమెల్ల । అరవిరలముగ నేను యట్టేగూర్చినాడ॥దూ॥ ధరణీ మళురబాద పురమందునెలకొన్న పురమర్దనుని పాదములగొల్చువాడను ॥దూ॥

వ॥ అని యిటులరుదెంచి నక్షత్రకుని జూచి యేమనుచున్నాడన.

మా ట లు

వీ॥ ఓ బాపనయ్యా యెంతకిస్తావయ్యా యీానెను.

న॥ కోటివరహాలు

వీ॥ అబ్బో నీకాళ్ళు మొక్తా యిన్నిరూపాయలా యీానెకు.

వ॥ నీకిష్టమైన యెడల కొనుము లేకున్న నీదారి గనుము.

వీ॥ ఆ గోమంటివి నేను జెప్పినపని జేస్తడా మాయింట్ల వుంటడా.

న॥ నీ వెందు నీయింట నేమిపని జెయ్యవలె.

వీ-గీ॥ కాటికాపరినయ్య నేకాలయముని। వంటివాడను మాదిగ వాడనయ్య। కులము తక్కువ యనుటొక్క కొరతగాని। మహినినను బోలునట్టి శ్రీమంతుడెనడు॥

వ॥ నాకొక్క జీతగాడు కావలసి వుండి చానా దినాలనుంచి యె తుకుతున్న యీానన నేను జెప్పినపని చేసేటట్టుంటె కొంటాకాని.

వాదం - దర్వు.

వీ॥ యెక్కువ తక్కువ జెప్పకూ। యిం। కొక్కమాటజెప్పు నిక్కకూ॥
హ॥ నీవేమి గొందువు మూర్ఖుడా। ఛీ। యావల దొలగుము నీచుడా॥
వీ॥ చింపిగుడ్డలజూచి పల్కెవా। నే। శ్రీమంతుడను గాదనుకున్నావా॥
న॥ జననాథ యెవడైతె నేమికా। మనకు। ధనమే ప్రధానముసుమ్మికా॥
వీ॥ చెప్పిన పనులన్ని జేయునా। యింక। తప్పిన దండింతుయొప్పునా॥
హ॥ నిన్నుజూడ కంపు గొట్టురా। యింక। నన్నెట్లుగొందువుచెప్పరా॥
న॥ కోటివరహాలిందు దెమ్మిరా। యీా। మేటికూరుని గొనిపొమ్మిరా॥
వీ॥ యిప్పుడే యిచ్చెద గైకొని। నా। కొప్పజెప్పమింక వీనిని॥
న॥ గొనిపొమ్ముయిక వీరబాహుడా। మా। రుణముదీరెను సత్యశీలుడా॥
హ॥ ధరణిపాలుండ బాద వాసుడూ। యెంత। వరకీడ్చెముమ్ము గారీశుడూ॥

వ॥ అంత నక్షత్రకుండు వెదలిపోవుటయు వీరబాహుండు హరిశ్చంద్రునకు వీరదాసుండని నామంబిడి స్మశాన భూమికిం దోడ్కొని పోయి యేమనుచున్నాడన.

వీర-గీ॥ వినర నామాట లివియెల్ల వీరదాస। గుదియ చేతుల బట్టుక బెదరకుండ। కాటిభూమిని రేపవల్ గాచియుండు। మిదియెనా యాజ్ఞ నింక నేనేగువాడ॥

వ॥ ఇంకా వొకటి యేమనగా వచ్చిన కళేబరమున కొక్కంటికి వొక మాడవంతున వసూలు జేయుము.

హ-వ॥ మంచిది ఆలాగే స్వామీ అనిన వీరబాహుడు వెడలిపోవు టయు నంత నక్కడ కలహకంఠి గృహంబులో చంద్రమతి వుదయాస్తమానములు పనులు చేయలేక నలసి తన మదిలో.

చంద్ర - దర్వు - ఆట.

యేమిసేయుదు గౌరనాథా । నే । నెటుల భరింతు నీవేథా నామనోహరునకు నన్నెడబాసియు । యీమహావిపదాంబుధిని ముంచి తివమమ్మ ॥యే॥ వేసటనొందెను నాదేహంబూ । పనుల జేసి జేసియు నిరతంబూ । కాసంత కరుణలేకను నన్ను యిటువలె । దాసిపనులలోనీవు త్రోసితి వయ్యయ్యో ॥యె॥

వ॥ యిటుల దుఃఖించుచున్నంతలో కలహకంఠి వచ్చి యేమనుచున్నదన.

కల-వ॥ ఓసే చంద్రీ యేమి జేయుచుంటివే.

వాదం - దర్వు.

కల॥ యింటినిండ కసవు పెంటవోలేనుండె నేమేచంద్రీ ॥ వూడ్చి యుంటివ లేదా గూర్చుంటివి యిచ్చోటి దేమెచంద్రి ॥

చం॥ యిప్పుడిప్పుడె వూడ్చి యిచ్చోట గూర్చుంటి నమ్మగారు । నన్ను । తిప్పలబెట్టకు మొప్పూలకుప్ప మాయమ్మగారు ॥

కల॥ కూర్చుంటె పనులెల్ల కొనసాగు మాయింట యే మెచంద్రీ । నే । వొర్చెదాననుగాను వుడుకునీళ్ళు దోడవే మెచంద్రి ॥

చం॥ ఆలాగె దోడెద నమ్మ సైరింపుమాయమ్మగారూ । నా । ఫాలమందున బ్రహ్మ వ్రాలిట్లు వ్రాసెనో యమ్మగారు ॥

కల॥ రోటిలో బియ్యంబు పోశేసి యున్నావ యేమెచంద్రి । నీ । కూటికేలాగొచ్చు కూర్చుండపనిలేదు వినవెచంద్రీ ॥

చం॥ చేసిన బియ్యంబు చేటలోనుంచితి నమ్మగారు । వో । భాసురాంగి మకుర బాదవాసునిసాటి అమ్మగారు ॥

వ॥ యిటు లనుచున్నంతలో లోహితుండరుదెంచి చంద్రమతితో యేమనుచున్నాడన.

లో-వ॥ అమ్మా నేనీ బ్రాహ్మణ కుమారాండ్లను గూడి అడవికి బోయి పుష్పంబుల గోసికొని వచ్చెదనే తల్లీ.

చం-వ॥ అటులే బోయిరా కొడుకా.

గీ॥ ధరణిపాలుడు నీయొక్క తండ్రిగారు। వొప్పుగాతాను సత్యంబుదప్పడేని । యెంచగా నేపతివ్రత నేనినీకు । ప్రాణభీతియు లేదునా బాలవినరా ॥

వ॥ అని దీవించిన లోహితాస్యుండు బ్రాహ్మణబాలకుల గూడి యడవిలో.

బాలకుల - దర్వు.

రండీబాలకులు మీరందరునూ । కారండపడవిలో । నిండూ ముదమూతో । మనమిప్పుడునూ । దండిదండి వృక్షంబులెక్కి మన మొండొరులము పుష్పంబుల గోతము ॥రం॥ ఫలమూలుగోసీ మెక్కుదామూ । పర్ణంబులగోసి । వలనొప్ప చంకబెట్టుదామూ । సలలిత మొప్పగ సమిధలు నేరుక । అలసట జెందక నాడుకుందమూ॥రం॥ చల్లని జలములు త్రావుదామూ । చల్లులు మెక్కియుమన । మెల్ల వనచరముల గనుగొందాము । పుల్లములో రంజిల్ల మథురపురి । నల్లనికుత్తుకగల్ల శివునినిడి ॥రం॥

వ॥ అని యిటుల బాలకులందరు వనంబున చరించుచుండగా లోహితాస్యుని నొక యురగంబు గరచుటయు.

లో-కం॥ అబ్బా యేమోగరచెను । బొబ్బలు చెలరేగెవొళ్ళు బుద్ధియు జెదరెన్ తబ్బిబ్బుదోచె తాళను । దబ్బున మీరేగినాదు । తల్లికి జెపుడీ ॥

వ॥ అని భూమిపైబడి లోహితాస్యుండు నోటనుండి బురుగులు గ్రక్కుతు ప్రాణంబుల్ విడచెనంత బ్రాహ్మణ కుమారులు చంద్రమతికడ కరుదెంచి యేమనుచున్నారన.

బ్రా-క॥ అమ్మా నీసుతునకు స । ర్పమ్ము గరచె యడవిలోన । ప్రాణము విడచెె । సుమ్మా మేమందరము భ । యమ్మున నిటువచ్చి తెల్పినామికతల్లీ ॥

వ॥ అనిన చంద్రమతి హాకుమారాయని భూమిపైబడి మూర్ఛిల్లి కొంతవడికిలేచి యేమని దుఃఖించుచున్నదన.

చం-దర్వు-ఆట.

హాహా లోహితాస్య । హాహా ముద్దులతనయ । హాహా సుందరాకారీ । హాసుగుణధీర ॥౧॥ కాలసర్పమునిన్ను గరచి ప్రాణముగొన । రలలీ వాసెనా నీరజోద్భవుడూ ॥౨॥ రారాజ సుతుడావై రమణీయ ముగబుట్టి। ఘోరవిపత్తుల గూలనైతివిహా ॥౩॥ నినుజూసి నేనెట్లు నిలువ నోపుదుతండ్రి । మనసీజరూపావో మాయయ్యరారా ॥౪॥ యిలను మశుర బాద యీాశుడెల్లెడలను గలడనుమాట నిక్కముగాకపోయె ॥౫॥

వ॥ అని యిటుల దుఃఖంచుచున్న చంద్రమతింజూచి కలహాకంఠి యేమనుచున్నదన.

కల-క॥ నీకంటె తెలివితేటలు । నాకెక్కువ గలదు నంగ । నాచిరొాయిటులన్ । శోకింపుచుండగబను । లేకరణిని తీరునెవ్వ । రిటు జేయుదురే ॥

వ॥ నీవు యింటిపనులన్ని మాని శుద్ధ శుక్రవారము సందెవేళ నట్టింట కూర్చొని యేడుస్తుంటె నిన్నెవరు మెత్తురు వూర్కొనెదవా లేక పొరకకట్టతో పూజించమనెదవా లెమ్ము

చం-మ॥ వినవమ్మా దయజూడగావలయు నీ । వీవేళ నన్నింకనా తనయుండుగ్రత రాహిదష్టుడగుచున్ । జానెట్టులున్నాడొ యా వనభూమిన్ పడువానిదెచ్చి బ్రదికిం । పన్ జాలు మందిచ్చి గ్ర క్కునరక్షింపవె పుత్రభిక్షమిడినా । కుం ప్రేమసంధిల్లగన్ ॥

వ॥ అని పాదంబులపై బడిన యా కలహాకంఠి చంద్రమతిం ద్రోసివేసి తన్ని యేమనుచున్నదన.

వాదం - దర్వు - ఆట.

కల॥ కొడుకు కొడుకనియింత మిడుకుచుంటివిదేల దాసిదాన । యా । దుడుకు పోరనికయ్యె దుఃఖమెందుకునీకు దాసిదాన ॥

చం॥ కన్నకొడుకువాని కనకెట్లు నోర్చెద నమ్మగారు । నన్ను మన్నించి సెలవివ్వ మహావేగిర మెవత్తు నమ్మగారు ॥

కల॥ చెప్పినట్టులవిని చేసెదవాలేదా దాసిదాన । నే । తప్పిన దండింతు తాళనె నిన్నింక దాసిదాన ॥

చం॥ కోపమెందుకు రాదు కొడుకును బాసియు నమ్మగారు । నే నోపజాలను యిప్పుడేపోయి వచ్చెద నమ్మగారు ॥

కల॥ పట్టెమంచముపైన పరపూను బరచీయు దాసిదాన । నిద్ర బట్టువరకు కాళ్ళు గట్టిగ బిసుకావె దాసిదాన ॥

చం॥ పరచియుండిపక్క పవళించురావమ్మ అమ్మగారు । కాళ్ళు కరమొప్ప నొత్తెద కరుణించునాపైన అమ్మగారు ॥

కల॥ కూర్కుజెందినదాక గూర్చుండియుండవె దాసిదాన । నే కూర్కుజెందినపైన కొడుకూనుగనిరమ్మ దాసిదాన ॥

చం॥ అటువలె నీయొక్క యాజ్ఞమీరనుతల్లి అమ్మగారు యా । పటుతరమౌ మశురబాద వాసునిసాక్షి అమ్మగారు ॥

వ॥ ఇటులా కలహాకంఠిని నిద్రబుచ్చి చంద్రమతి యడవింబ్రవే శించి లోహితాస్యుని కళేబరంబుపై బడి యేమని దుఃఖంచుచున్నదన.

చంద్రమతి - దర్వు - ఆట.

నను బాసి పోతివా నాముద్దుతనయా । నినుబాయజాలనో నిర్మల హృదయా ॥అ॥ అమ్మాయనుచుబిల్వ వదియేర కొడుకా । యిమ్మహి లోన నేనింకేల బ్రదుకా ॥౨॥ పాపకారిబ్రహ్మ వ్రాలిట్లువ్రాసె । నోప జాలనుతండ్రి నీపాటు జూచీ ॥౩॥ వసుధమశురబాద వాసస ర్వేశా । కసి దీరెనా నీకు గౌరీహృదేశా ॥౪॥

సీ॥ నిండుపున్నమవంటి నీయొక్కవదనంబు । కందిపోయెను నహా కన్నతండ్రి । సంగడికోలల సరియైనహస్తముల్ । సోలిపోయెను చిన్ని బాలనీకు । బంగారు వన్నెల పరిహసించిననీదు । చక్కనిదేహంబు చెక్కుజెదరె । పట్టుపరుపులపైన పవళించు నీపిట్లు । కరకు నేలలోబడి పొరలుటాయె । యేమిసేయుదునాయొక్క నోముఫలము । యింతె గాబోలు నిన్నిప్పు డెత్తుకొనియు । దహన సంస్కారములుజేసి త్వరిత గతిని । యేగకుండిన కలహాకంఠెట్లుసెచు ॥

వ॥ అని యా అర్ధరాత్రంబున మృతకళేబరంబు నెత్తుకొని చంద్ర మతి స్మశాన వాటిక కేతెంచి చితించేర్చి లోహితాస్యు నందుంచి దుఃఖంచుచుండిన వీరదాసుండా యార్తనాదంబు విని వచ్చి యేమను చున్నాడన.

హరి - కందార్థము

వనితా యీనడిరేయిని । వనులకు శంకింపకేల । వచ్చితినీవ । రత్ననేమి భర్తయెవ్వరు । వినుపింపుము వినగనాకు ॥దర్వు॥ వినుత సుశీలా । నీదుపేరు వినియెదజాలా ॥మిత్ర॥ ఘనతరంబగుదుఃఖమేమిట గలిగెనే యీ ప్రేతభూమికి । నొనగునా శాసనము సద్గిగై । కొనక రాజన దిచట నేరికి ॥వినుత॥

చంద్ర - కందార్థము

కరుణాకర నేనొకభూ । సురనాథుని దాసివయ్య । సూనుడు వీడుణ । యురగము ముట్టిన జచ్చెను । తెరగెయ్యది దోచదాయె ॥ దీనురాలనుగా । యీ దుఃఖంబు మానజాలనుగా । నరనుత విని దహనంబు జేయుటకిందు । జొరివస్తి చేతులుజోడించి మ్రొక్కెద ॥దీను॥

వాదం - దర్వు - ఆట

హ॥ మానీని మణివొక్క । మాడనాకొసగియు । పీనుగ నిటు గాల్చుకొనుమూ । మాటవినుమూ ॥

చం॥ దాసురాలనొక్క కాసైన లేదయ్య । దోసిలొగ్గితిని మన్నింపూ । దయదలంపూ ॥

హ॥ యజమాని యాజ్ఞ నేనెటువలెదోృయుదు । అజరుప్రాదులు వచ్చినాను । వినను నేనూ ॥

చం॥ యేమిసేయుదుమాడ । నెటువలెగొనితు । స్వామినన్ కరుణించుమయ్యా । బీదనయ్యా ॥

హ॥ మాడలేకున్న నీమంగళసూత్రము । నూడదీసియు నివ్వరాదా । యింతవాదా ॥

చం॥ ధంణీ మకురబాద ధాముడై వెలసిన । హరుని చిత్రము దోచదాయా । తెలియదాయా ॥

చం-వ॥ నామంగళసూత్రము నాప్రాణనాధునికి దప్ప యితరులకు కనబడదు కావున యీయన నా ప్రాణేశ్వరుండు కాబోలునని శంకించి యేమనుచున్నదస.

గీ॥ సప్తద్వీపంబులను యేక చక్రముగను । చక్కగా నేలు యా హరిశ్చంద్రునకును । సుతుడు వీనిని దహియింప క్షితితలమున । స్థలము లేకుండ వ్రాసెనా తమ్మిచూలి ॥

హ-వ॥ హా ప్రాణేశ్వరీ యీ దుఃఖాంబుధి నెట్లు తరింతును.

చం-వ॥ ప్రాణేశ్వరా రాజాధిరాజువైన నేడు నీకీ వల్లకాడునకు కాపరి యగుట విధి వ్రాసెనా అయ్యో.

సీ॥ ఈమంచ నవరత్న హేమసింహాసన । మూ యెనా రాజకులావతంస । యీభూతజాలముల్ హితపురోహితమంత్రి ।, పరిజనంబులె భూమిపాలతిలక । యీనివారుతము మీకెలమి మాగధగీత । మాయనే సార్వభౌమాభిరామ । యీకొరవి దయ్యముల్ భీకర భటవర్గ । మాయెనే సుజన విధేయనీకు ॥ మనుజ శిరములు ఘనమైన కనక కుంభ । చయమె యీవెంట్రుకలునీకు చామరములె । ప్రేతభూమియు మీకు సాకేతపురమె । ధారుణీనాథ విధినెట్లు దూరుదకటా ॥

హ-వ॥ ప్రాణేశ్వరీ మన ప్రారబ్ధ మిట్లుండ నేమి సేయుదము హా కుమారా వంశవర్ధనా పోయితివా.

హరి - దర్వు - ఆట.

నాముద్దు పుత్రిక లోహితా । నీవు । నన్నెడ బాసితివా లోహితా । ప్రేమతో నీనగు మోము ముద్దొకటిమ్ము।నామూలధనమా నే నేమిసేయుదుతండ్రి ॥హా॥ యెన్ని యెటులైన నే నోర్చితి। నీ । వున్నావనుచు సంతసించితి। కన్నతండ్రిరో నన్ను కన్నెత్తిజూడుము । యెన్నడు యిటులౌట యెరుగ నాకలనైన ॥పా॥ ధరణి మకుర బాద వాసుడూ । యింత । దయదప్పె మనపై విశ్వేశుడూ । పరగ యీ దుఃఖంబు భరియింప నోపను । చిరుతా నినెన్నెడబాసి జీవింతునెటువలె ॥నా॥

చం-వ॥ నాధా తెల్లవార వచ్చుచున్నది. యిటుల దుఃఖించిన మన నోదార్చు వారెవరు త్వరగా చితికి నగ్నిని ముట్టించుడు.

హ-వ॥ కాంతా నేనేమిసేయువాడను నాయేలికయగు వీరబాహుని యాజ్ఞానుసారము నొక మాడ గైకొనక శవమును దహింపజెల్లదు త్వరితగతి నేగి యెందైననొక మాడను గొనిరమ్ము పొమ్ము.

వ॥ అనిన చంద్రమతి మిగుల దుఃఖించుచు కాశీపురంబుజొచ్చి పోవుచున్నంతలో.

దొంగ ప్రవేశము - దరువు

దొంగల్లోనేను మొనగాడరా । జనుల । భంగపుచ్చేటి దండి ఘనుడనురా । రంగైన యిండ్లల్లో చెంగూన పడద్భంకి । బంగారు నగ లెల్ల దొంగిలించెడివాడ ॥దొం॥ అద్దుమ్మ రాత్తిరి నిద్దుర ప్రొద్దున । మిద్దేలు పగులగొట్టేద్దునురా । సద్దులేకుండాను । సందుగొందులుదిరీ । బాద్దూరి పనులెల్ల జేద్దూనురా ॥దొం॥ సంకెళ్ళు బడినాను శంకలేకుం డాగ అంకాలమ్మకు మొక్కి యరిగేదరా । బింకముతో రాజ కింకరు లొచ్చిన । జంకులేక నేను దెంకెల్లురా ॥దొం॥ భూరి మశురబాద పుర వాసుడైనట్టి తారేశుమౌళిని దలచెదరా । దారూ గొట్టియు సాయి దాగి హుషారుతో పనులెల్ల సలిపెదరా ॥దొం॥

వ॥ ఇయ్యాల యీకాశీరాజు కొడుకను జంపి యీనగలెల్ల దొంగి లించుకొని తెస్తినికాని రాజభటులు నన్ను తరుముకుంటూ వచ్చుచుం డిరి. యీమూట నేమిచేద్దును అని దారిలో చంద్రమతిం జూచి.

మాటలు

దొం॥ అమ్మా నీవెవరు యీ యర్ధరాత్రి యెక్కడకేగుచుంటివి.

చం॥ అన్నా నేనొక బీదరాలను నాకుమారుండు సర్పదష్టుండై మృతినొందెను వానిం గాల్చుటకు నొకమూర పడిగె దెచ్చుటకై బోవు చుంటిని వొకమాడ నుండిన దయసేయుము.

దొం॥ అమ్మా అటులైన కొంచెమీమూటను బట్టుకొనుము నే నిప్పుడే మాడనుదెచ్చి యిత్తును అని దొంగ వెడలిపోయి నంతలో రాజ భటులరుదెంచి చంద్రమతింజూచి.

భటులు - దరువు

పాతకి యీరాజసుతుని ఘాతజేసి సొమ్ముల్లెల్లనీతీరున దొంగిలించ భీతింతయు లేదనీకు ॥పా॥ రకాసివోగాక కాళరాత్రివో నీవు బాలు । చిక్కబట్టి చంపనీకు చేతులు నెట్లాడెనొకా ॥పా॥ వారక శ్రీమశురబాద । గౌరీశంకరునిసాక్షి । ధీరతో భూమీశుడు వ్వరిదీయక మానడు నిన్నిక ॥పా॥

వ॥ అని యా రాజభటుడు చంద్రమతి నీడ్చుకొని పోవుటయు నంత నక్కడ హరిశ్చంద్రుండు.

హరి - దర్వు - ఆట.

సతిరాకపాయె నీసుతునెట్లు దహియింతు। వెతలపాలైతి యేగతి దోచదాయె ॥స॥ భానుకులమునబుట్టి మానవేంద్రుడనయ్యి । హీన జాతికొల్వ యేగొల్వనైతి ॥స॥ కులవర్ధనుండైన కొడుకును బోనాడి । యిలలోన జీవింప నెటులోర్చుదింకా ॥స॥ వసుధ మశునబాధ వాసుడైనట్టియా । పశుపతి కరుణ నాపైనింక రాదో ॥స॥

వ॥ అని యిటులనుకొను చున్నంతలో రాజభటులు చంద్రమతి నీడ్చుకొని వచ్చి వీరదాసుండను హరిశ్చంద్రుని పాదములకడ బడవైచి నొక వుత్తరంబిచ్చిన హరిశ్చంద్రుడది గైకొని యేమని చదువుకొను చున్నాడన.

సీ॥ ఘనబాహు బలుడైన కాటికాపరివీర । దాసుని కిప్పుడు వ్రాసినదియు । యేమునగాయిట్టి యింతి నాబాలుని । జంపియుసొమ్ములు సంతరించి । పారిపోవగ రాజభటులది గనిపెట్టి । కట్టి తెచ్చిరిదీని కడు రయమున । శోధించగామాదు సొమ్ములన్నియుజిక్కె । గాన దీనికి నేడు కఠినముగను ॥ శిక్షవిధించు టేమన నీక్షణంబె । ఘోర తర ఖడ్గమున దీని గొంతునరికి । భూమిలో పూడ్చి వేయు నీభుజబలమున । యిదియె నాయాజ్ఞ సంశయ మేమివలదు॥

ఇట్లు
కాశీరాజు

వ॥ హరిశ్చంద్రుడా వుత్తరము చదువుకొని హా పరమేశ్వరాయని కృపాణము లేవనెత్తినంతలో హరి హర బ్రహ్మేంద్రాదులు విశ్వామిత్రి వశిష్ఠాది మునులు ప్రత్యక్షంబై యప్పుడు.

విశ్వా-గీ॥ తాళుతాళుమయ్యా ధరణీతలేశ్వర । నిన్నుబోలువాని నెందుజూడ సత్యసంధుడనగ సహజంబు నిన్నిక । పుణ్యమూర్తి నిన్ను బొగుడతరమె ॥

శివు-కం॥ పదునాల్గులోకములలో । విదితంబుగ నిన్నుబోలు । వీరుడు గలడే । సదమల సత్యాత్ముడవని । మది దెలిసితినయ్యా భువన । మాన్యచరిత్రా ॥

హా-వ॥ హే కైలాసపతే హీన జాతీయుని సేవకుండనగు నన్ను గౌరవించుట దగునే.

ఈ-వ॥ రాజన్యతిలకా యిదియెల్లను నాయొక్క మాయనే కాని నిజముగాదు నాయొక్క దివ్యదృష్టి నీకొసంగితిని జూడుము.

హా-గీ॥ కాలకౌశికుడ ఋవాడు కాలుడరయ । వీరబాహుండు సురపతి విమలయశుడు । కాశిపట్టణ ప్రభుడు నీకౌశికుండు । సర్వమును మాయగాదోచె స్వాంతమందు ॥

వ॥అని యిటులనుచున్నంతలో స్మశానభూమి నందన వనముగా మారుటయు నింతలో లోహితాస్యుండు పునర్జీవితుండై జననీ జనకులం జూచి దండప్రణామంబులిడిన వారలు బాలునెత్తుకొని ముద్దాడి అట్టి సంతోష సమయంబున పరమేశ్వరుని పేరట మంగళ హారతులిచ్చి రెటులన.

మంగళహారతి.

మంగళంబనుచు బాడరే । గంగాధరునకు । మంగళ హారతులు నివ్వరే । మంగళంబనరె సారంగనయనులారమీరు । లింగరూపునకును దారుకాంగనా భుజంగునకును ॥మం॥ నందివాహనునకు భవునకూ । వందారుమౌని బృందవందితునకు హరునకూ । కందర్ప దమనునకు । సుందనిభ గాత్రునకు । మందరాద్రి ధీరునకు।యిందుకళాధరునకు ॥జయ॥ మం॥ శరధి తూణీరధరునకూ । కరుణాకరునకు । గిరివర కోదండ ధరునకూ । ధరణి మకురబాద పురిని । నిరతము వసియించిభక్త । వరులను రక్షించు త్రిపుర హరునకు పరమేశ్వరునకు ॥మం॥

సంపూర్ణము.